"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీయింక,
సరదాగా యిది చెయ్యాలింక"

-ఫెవీ ఫెయిరీ




"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తో చేసే తమాషా యిది
దబ్బుతోనూ పనియే లేదు.
దీనికి మరి యిక తిరుగే లేదు"
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏం చెయ్యాలో దబ్బున చెప్పు"
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో విని పొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా ఏ బుట్టయినా
ఏ వస్తువయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషా యిక
బొమ్మేదైనా చేసెయ్యింక".

మీకు కావలసినవి:

- కార్డ్ బోర్డ్
- ఆకుపచ్చని వెల్వెట్ కాగితం
- పసుపుపచ్చ ఛార్ట్ కాగితం
- జేగూరు రంగు కాగితం
- పాత క్యాలెండరు
- ఖాళీ సిగరెట్టు పెట్టె
- ఆకుపచ్చని సిల్కుదారు
- ఫొటో కార్నర్లు (నాలుగు)
- ఫెవికాల్ ఎమ్ఆర్ ఎడ్హెసివ్





1. ఇక్కడ చూపించినట్లుగా, టఫీ శరీర ఆకారాన్ని, తలని, కార్డ్ బోర్డులోంచి కత్తిరించండి. ఫెవికాల్ ఎమ్ఆర్‌తో, శరీరాన్ని, తలని ఆకుపచ్చని వెల్వెట్ కాగితంతో అంటించి కప్పండి.







2. చూపించినట్లుగా, నాలుగు పాదాల్ని, తోకని కత్తిరించండి. దానిని ఆకుపచ్చని వెల్వెట్ కాగితంతో కప్పండి. తల, శరీరం, పాదాలూ, తోకా విడివిడిగా ఉన్నవి, టఫీ తయారయ్యే విధంగా అంటించండి.




3. పసుపుపచ్చని ఛార్ట్ కాగితంపైన, చూపించిన విధంగా, టైమ్ టేబుల్‌ని తయారుచెయ్యండి. పేర్లను కత్తిరించి చూపించినట్లుగా అతికించండి.









4. పసుపుపచ్చ ఛార్ట్ కాగితంనుంచి, టఫీయొక్క కళ్ళు, 12 గోళ్ళు, 8 స్కేల్స్ (ప్రతి రకానికీ 4 చొప్పున) కత్తిరించండి. చూపించినట్లుగా, టఫీయొక్క ముఖం, పాదాలు, శరీరం వీటిని అలంకరించండి.










5. సిగరెట్టును పెట్టెను 2 ముక్కలుగా కత్తిరించి, దానిని ఆకుపచ్చ వెల్వెట్ కాగితంతో కప్పండి. రోజులు, నెలలు, తారీఖుల పేర్లను క్యాలెండర్ లోంచి కత్తిరించి, వాటిని ఛార్ట్ కాగితంపైన అతికించండి—రోజు, తారీఖులకు 8" × 1.5" ముక్కల్ని, నెలలకు 4" × 1.5" ముక్కల్నిను.



6. టఫీయొక్క శరీరంపైన 4 ఫొటో కార్నర్లనూ పెట్టి దాన్లో టైమ్ టేబుల్‌ని పెట్టండి. సిగరెట్టు పెట్టె సగం ముక్కల్ని పక్కల్ని అంటించండి— దాన్లో రోజులు, తారీఖులు, నెలలూ వీటిని అమర్చండి.



7. చూపించిన పద్ధతిలో, సిల్కుదారు లూప్‌ని టఫీ శరీరపు వెనకాల అంటించండి. వెనక వైపు గల టఫీ శరీరాన్ని జేగూరు రంగు కాగితంతో కప్పండి.

టఫీ ది టార్ టాయిస్ (తాబేలు) తయారు!
ఇప్పుడిక టైమ్ టేబుల, దాంతోపాటే ఏడాదంతా ఏమే రాబోకో చెబుతాడు!




# ఫెవికాల్ ఎమ్ఆర్
## సింథెటిక్ ఎడ్హెసివ్

**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

# మీ ప్రియాతి ప్రియమైన బిడ్డకు ప్రత్యేకమైన సబ్బు కావద్దూ!

ప్రపంచమంతటిలోకీ సుతిమెత్తని పట్టులాంటి చర్మం మీ బిడ్డది. అంతటి నాజూకైన చర్మానికి మామూలు సబ్బేలా సరిపోగలదు!

మామూలు సబ్బులు పెద్దవారికోసం తయారైనవి. అందుచేత వాటితో పిల్లల లేత చర్మాలకు సరైన సంరక్షణ లభించజాలదు.

11-12 ఏళ్లలోపు వయసుగల పిల్లల చర్మాల సంరక్షణకై ఇప్పుడు వచ్చింది బబుల్స్ ఇదొక సౌమ్యమైన కొత్త సబ్బు. పిల్లలకోసం ప్రత్యేకించి తయారుచేయబడిన సబ్బు.

**బబుల్స్‌లోని ప్రత్యేకత ఏమిటి?**

బబుల్స్, మీరు మీ బిడ్డకోసం ఎలా తయారుచేసి ఉండేవారో అచ్చంగా అంతే జాగ్రత్తగా తయారుచేయబడినది. అంటే, శుద్ధమైన పోషక తైలాల సమ్మిశ్రణం, మమత నిండిన మాతృ స్పర్శలోని సౌమ్యత ఇందులో ఉన్నాయి.

బబుల్స్ మీ బిడ్డ చర్మాన్ని అది ఉండవలసిన రీతిలో, అంటే సహజమైన సమతూనికతో నిలిపి ఉంచుతుంది.

బబుల్స్ యొక్క సమృద్ధమైన నురగలో సంతోషంగా స్నానం చేయాలనీ, ఆడుకోవాలనీ మీ బిడ్డ మరీ మరీ కోరుతాడు.

బబుల్స్ ప్రపంచమంతటిలోకీ అతి ప్రత్యేకమైన కారణంగా తయారైనది. మీ బిడ్డ కోసమే తయారైనది.




బబుల్స్

**పిల్లలకోసం ప్రత్యేకమైన సబ్బు**

బబుల్స్–12 ఏళ్లలోపు వయసుగల పిల్లలకోసం.

everest/84/WIL/490-tl

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మంత్రశక్తులు''] కు అధారం, బొమ్మిడి అచ్చారావు రచన. రాజ్యపాలకుడైన వాడు అనాలోచితంగా ఏదైనా పని చేస్తే, అది ప్రజలందరికీ కీడుగా పరిణమిస్తుంది. అలాంటివాణ్ణి సరి అయిన దారిలో పెట్టడానికి తెలివితేటలతోపాటు ధైర్యం కూడా అవసరం. ఇందుకు, ''కుందనుడి తెలివి'' అన్న కథ చక్కని ఉదాహరణ.

## అమరవాణి

నరత్వం దుర్లభం లోకే, విద్యా తత్ర సుదుర్లభా,
వివేకో దుర్లభ స్తత్ర, దాతృత్వం చ విశేషతః.

[మానవజన్మ దుర్లభం అంటారు. అయితే, విద్యావంతుడు కావడం మరీ దుర్లభం. వివేకవంతుడవడం అంతకన్నా దుర్లభం. ఇక, దాతృత్వగుణం కలిగివుండడం అనేది అన్నిటికన్నా దుర్లభం.]

సంపుటి 76 జూన్ '85 సంచిక 6

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00





# కుందనుడి తెలివి

విజయపురి మహారాజు చంద్రసేనుడు, మహారాణితో అంతఃపురంలో కొడుకు విద్యాభ్యాసం గురించి మాట్లాడుతూండగా, ఎలా వచ్చిందో ఒక కాకి, గవాక్షం నుంచి లోపలికి వచ్చింది. వెంటనే దాసీలు దాన్ని బెదరగొట్టి బయిటికి తరిమేశారు. అయితే, కాకిని చూస్తూనే రాజుకు ఒక చిత్రమైన ఆలోచన వచ్చింది.

ఆయన అప్పటికప్పుడు మంత్రికి కబురు చేసి, "మన విజయపురి రాజ్యంలో, ఎన్ని కాకులున్నాయో పొరబాటు లేకుండా సరిగ్గా చెప్పగల వ్యక్తికి మంచి బహుమానం యిద్దాం. కాని, చెప్పగలనంటూ వచ్చి, సరిగ్గా చెప్పలేనివాడికి ఇరవై కొరడా దెబ్బల శిక్ష వుంటుంది. ఆలస్యం జరక్కుండా, ఈ సంగతి రాజ్యమంతటా చాటింపు వేయించండి," అని చెప్పాడు.

మంత్రి ఆ విధంగానే రాజ్యమంతటా చాటింపు వేయించాడు. వారం రోజులు గడిచినై. అయినా, ఎవరూ యీ వింత ప్రశ్నకు జవాబు చెప్పేందుకు ముందుకు రాలేదు.

కుందనుడనే యువకుడొకడు, విద్య ముగించుకుని, ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమో అని రాజధానికి వచ్చి, యీ వింత చాటింపు విన్నాడు. అతడికి ఆశ్చర్యంతోపాటు, రాజు చంద్రసేనుడి పరిపాలనా సామర్థ్యం పట్ల అనుమానం కూడా కలిగింది.

అతడు రాజసభకు పోయి, రాజుకు నమస్కరించి, "మహారాజా, నేను చదువుకున్న నిరుద్యోగిని. ఉద్యోగ ప్రయత్నంలో నేను ఎంతో కాలంగా, మన విజయపురి రాజ్యంలోని పల్లెలూ, పట్నాలే కాక కుగ్రామాలు కూడా తిరిగాను. ఆ

కలిదిండి జయ



''ఆ సంగతి చెప్పగలను, మహారాజా,'' అన్నాడు కుందనుడు.

''సరిగ్గా చెప్పలేకపోతే, ఇరవై కొరడా దెబ్బలు తినవలసివస్తుంది,'' అన్నాడు రాజు.

''అది గుర్తున్నది, మహారాజా. మన విజయపురి రాజ్యంలో—ఈ క్షణంలో వున్న కాకుల సంఖ్య మూడులక్షల ఇరవై వేలు!'' అన్నాడు కుందనుడు.

''అలాగా, సరే! నువ్వు చెప్పిన సంఖ్య సరి అయినదో కాదో ముందు తెలుసుకోవలసి వున్నది. ఇందుకు, ఆయా పట్టణ, పల్లెల అధిపతులకు వర్తమానం పంపుతాను. వాళ్ళు తమ ప్రాంతాలగల కాకుల సంఖ్య తెలుసుకుని, నాకు తెలియజేస్తారు,'' అన్నాడు రాజు.

''మహారాజా, ఈ క్షణంలో మన రాజ్యంలో వున్న కాకుల సంఖ్య, మూడు లక్షల ఇరవైవేలని చెప్పాను. వాటిని, మీరు చెప్పినవాళ్ళు లెక్కించే సమయానికి, వాటి సంఖ్యలో కొంత మార్పు వచ్చే అవకాశం వున్నది. ఎందుకంటే, కాకులు పరమ స్వేచ్ఛాజీవులు. వాటికి దేశాభిమానం లేకపోగా, దేశసరిహద్దుల పట్ల కించిత్తు గౌరవం కూడా వుండదు. అందువల్ల, పొరుగు రాజ్యం నుంచి కొన్ని కాకులు మన రాజ్యానికి వస్తే, మన

కారణం వల్ల నాకు, మన రాజ్యంలోని ఒక్క కాకులే గాక, కొంగలూ, గద్దలూ, చిలుకలూ, ధాబందులూ, పికిలిపిట్టలూ ఏ సంఖ్యలో వున్నవో స్పష్టంగా తెలుసు. అయితే, గుడ్లగూబల సంఖ్యా ప్రమాణం మాత్రం చెప్పలేను. అవి నిశాజీవులు కదా!'' అన్నాడు.

ఆ మాటలకు రాజు చంద్రసేనుడు చిన్నగా నవ్వి, ''నువ్వు చెప్పేది నిజమైతే, నీకు పక్షులపట్ల వున్న అసక్తి మెచ్చదగిందే! కాని, ఒక ముఖ్య సంఘటన కారణంగా, నేను రాజ్యంలోని కాకుల సంఖ్య మాత్రమే తెలుసుకోదలిచాను,'' అన్నాడు.

రాజ్యంలోని కాకుల సంఖ్య, నేను చెప్పినదానికి మించుతుంది. అలా కాక, మన రాజ్యం కాకులు పొరుగురాజ్యానికి వలసపోతే, వాటి సంఖ్య తగ్గుతుంది. ఇలాంటి అవాంతరాలకు నేను బాధ్యుణ్ణి కాను,'' అన్నాడు కుందనుడు.

సభికులందరూ కుందనుడి తెలివి తేటలకు హర్షధ్వానాల ద్వారా, తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. కుందనుడు పరోక్షంగా రాజుకు, యీ కాకుల సంఖ్య తెలుసుకోవాలని చేస్తున్న ప్రయత్నం, ఎంత పనికిమాలిన సంగతో తెలియ చెప్పినట్టు వాళ్ళకు అర్థమైంది.

రాజు కూడా అతడి సమాధానానికి ఎంతో సంతృప్తి చెంది, ''నీకు ఏం బహుమతి కావాలో కోరుకో!'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

కుందనుడు ఒక క్షణం ఆగి, ''క్షమించండి, మహారాజా! రాజు ప్రతినిమిషం ప్రజల యోగక్షేమాల గురించి ఆలోచిస్తూ, వాళ్ళకు ఉపయోగకరమైన పనులు చేయాలి. అంతేగాని, కాలాన్ని నిరుపయోగమైన ప్రశ్నలకు, సమాధానాలు కనుక్కోవడంలో వృధా చెయ్యకూడదు. మన రాజ్యంలోని కొన్ని ప్రాంతాల్లో ప్రజలు నీటి ఎద్దడికి గురి అవుతున్నారు. మరి కొన్ని ప్రాంతాల వాళ్ళను వరదలబాధ పట్టి పీడిస్తున్నది. ఇలాంటివే మరి కొన్ని సమస్యలు. తమరు నిపుణులతో సంప్రతించి, వీటికి పరిష్కార మార్గాలు వెత



కండి. అప్పుడు నేను నిరుద్యోగిగా వుండ నవసరం లేదు. అదే, మీరు నాకిచ్చే బహుమానం!'' అన్నాడు.

రాజు ఆ మాటలకు చాలా సంతోషించి, ''నిన్ను, నా ముఖ్య సలహాదార్లలో ఒక డుగా నియమిస్తున్నాను. రాజ్యం అంతా తిరిగానంటున్నావు కనక, ప్రజల అవసరా లేమిటో నీకు బాగా తెలిసివుండాలి. నువ్వనే నిపుణులతో సంప్రతించేటప్పుడు, నీలాంటివాడి సాయం నాకు చాలా అవసరం. ఏమంటావు ?'' అన్నాడు.

''మహారాజా, తమరు నాకెలాంటి బాధ్యత అప్పగించినా, అందులో నాశక్తి మేరకు, తమకూ, రాజ్యానికీ సేవచేయ గలను,'' అన్నాడు కుందనుడు.

''అలా అయితే, మరొక ముఖ్యమైన బాధ్యత కూడా నువ్వు అంగీకరించవలసి వుంటుంది. పదేళ్ళ యీడువాడైన, నా ఒక్కగానొక్క కొడుకు కుమారపాలుడి విద్యాభ్యాసం, ఒక సమస్యగా తయా రైంది. వాణ్ణి ఏ గురుకులానికో పంపడం నాకూ, మహారాణికి కూడా యిష్టం లేదు,'' అని రాజు చంద్రసేనుడు చిరు నవ్వు నవ్వుతూ, ''పదిహేనేళ్ళపాటు ఎంతో క్రమశిక్షణతో నేను గురుకులంలో చదివిన చదువు, రాజ్యపాలనకు ఏరకంగా ఉపయోగపడిందో నీవు ఎరిగినదేకదా! పుస్తకజ్ఞానంతోపాటు, లౌకికజ్ఞానంలో కూడా దిట్టవైన నీకు, కుమారపాలుడి చదువు సంధ్యల బాధ్యత అప్పగిస్తు న్నాను, అంగీకారమేనా?'' అని అడిగాడు.

''నా మీద ఎంతో నమ్మకంతో, కానున్న విజయపురి మహారాజుకు విద్యాబుద్ధులు నేర్పే పెద్ద బాధ్యత నా మీద పెడుతు న్నారు. ఇందుకు నేను అర్హుణ్ణని రుజువు చేసేందుకు, సర్వవిధాలా ప్రయత్నించ గలను,'' అన్నాడు కుందనుడు.

ఈ విధంగా కుందనుడు, రాజు అప్ప గించిన రెండు బాధ్యతలనూ సమర్థ వంతంగా నిర్వహించి, రాజు దృష్టిలోనే కాక, ప్రజల దృష్టిలో కూడా దక్షతగల వ్యక్తిగా పేరుపొందాడు.






## 8

[మంత్రగత్తె అయిన కాపాలిని, చంద్రవర్మకు భోజనం పెట్టించింది. తరవాత ఆమె శంఖుడనే మాంత్రికుడి వద్ద వున్న అపూర్వశక్తులుగల శంఖాన్ని తీసుకురావలసిందిగా అతణ్ణి కోరింది. కొన్ని మూలికలతో కాచిన కషాయం ఆ శంఖంలో పోసుకుని తాగితే, తను మరి వెయ్యేళ్ళు జీవించగలనని చెప్పింది. చంద్రవర్మ సరేనని బయలుదేరాడు. తరవాత—]

ముందు దారి చూపుతూ నడుస్తున్న కాలనాగును వెన్నంటి చంద్రవర్మ మాట్లాడకుండా నడవసాగాడు. సర్పం తన మూడు తలలనూ మాటిమాటికీ అన్ని దిక్కులకూ తిప్పుతూ, మధ్య మధ్య పెద్దగా బుసలుకొడుతూ గుబురు చెట్ల మధ్యగా పోసాగింది. ఆ చెట్లకింద అనేక రకాల క్రూరజంతువులూ, విషసర్పాలూ ఆ యిద్దరికీ ఎదురయినై. కాని, కాలనాగును చూస్తూనే అవి బెదిరిపోయి చెల్లాచెదరుగా పరిగెత్త సాగినై.

ఆ విధంగా అడవిలో కొంతదూరం వెళ్ళిన తరవాత చంద్రవర్మకు హఠాత్తుగా ఒక అనుమానం వచ్చింది. కాలనాగు మానవభాషను అర్థం చేసుకుంటున్నది. మాంత్రికురాలు మరో మనిషితో మాట్లాడినట్టే దానితో మాట్లాడి, ఆజ్ఞలు యిచ్చింది. కాని, అది మానవభాషలో మాట్లాడినట్టు




తను వినలేదు. తను ప్రయత్నించితే కాలనాగు మాట్లాడగలిగేదీ లేనిదీ తేలిపోతుంది.

చంద్రవర్మ యిలా ఆలోచించి, కాలనాగు దగ్గిరగా వెళ్ళి, "కాలనాగూ! మనం యీ అడవిని దాటాలంటే యింకా ఎంత దూరం నడవాలి?" అని ప్రశ్నించాడు.

చంద్రవర్మ ప్రశ్న వింటూనే కాలనాగు ఠక్కున ఆగిపోయింది. దాని మూడు తలలూ ఒకేసారి భూమి మీది నుంచి పైకి లేచి చంద్రవర్మ కళ్ళల్లోకి సూటిగా చూసినై. మరుక్షణం అది తన నాలుకలను ముందుకు సాచి చిన్న శబ్దం చేసింది. ఆ ధ్వని మామూలుగా అది కొట్టే బుసలలాగా లేదు. అందులో ఒకదాని వెంట ఒకటిగా రెండు మూడు రకాల శబ్దాలు వినిపించినై.

చంద్రవర్మ ఆశ్చర్యపోయాడు. అది గ్రహించినదానిలా కాలనాగు తన మూడు తలలనూ అటూ యిటూ తిప్పి, వెళుతున్న మార్గం నుంచి పక్కకు తొలిగి మరొక దిక్కుగా పోతూ, అనుసరించి రావలసిందిగా చంద్రవర్మకు సంజ్ఞ చేసింది.

కాలనాగు తనకేదో రహస్యం చెప్ప జూస్తున్నదని చంద్రవర్మ గ్రహించాడు. అందువల్ల అతడేమాత్రం సంశయించకుండా దాన్ని అనుసరించి నడవసాగాడు. కొద్దిసేపటికి ఇద్దరూ చీకటిమయంగా వున్న గుబురుచెట్లలోంచి బయటపడి, సెలయేరు ప్రవహిస్తున్న ఒక చోటుకు చేరారు.

కాలనాగు సెలయేటిముందు ఆగి తన తలలతో దాని అవతల వున్న ఒక వింత వృక్షం కేసి చూపింది. చంద్రవర్మ అటు కేసి చూసేంతలో వికారమైన నవ్వులూ, కేకలూ కూతలూ వినిపించినై. ఆ విచిత్ర ధ్వనులు వస్తున్న వృక్షం కేసి చూస్తూనే చంద్రవర్మ నిలువెల్లా ఫణికిపోయాడు.

అది ఒక వింతవృక్షం. నలభై యాభై అడుగుల ఎత్తున గుమ్మటంలా గుబురుగా

పెరిగిన ఆ వృక్షానికి రకరకాల జంతువుల తలలూ, పక్షుల తలలూ వేలాడుతున్నవి. అవి చంద్రవర్మనూ, కాలనాగునూ చూస్తూనే జంతువులలాగా అరవటం, పక్షులలాగా కూయటం ప్రారంభించినై.



చంద్రవర్మ వృక్షం మీది నుంచి తన దృష్టిని కాలనాగుకేసి తిప్పాడు. కాలనాగు అతడికేసే నిశ్శబ్దంగా చూస్తున్నది. చంద్రవర్మ వింతవృక్షాని కేసి చేయి చూపుతూ, "అది వృక్షమా ? లేక ఆ రూపంలో వున్న ఏదైనా భయంకర రాక్షసా?" అని అడిగాడు.

కాలనాగు నిశ్శబ్దంగా తలలు ఆడించి సెలయేటికేసి నడిచింది. చంద్రవర్మ దాని వెనకనే బయలుదేరాడు. కొద్ది సేపటికల్లా కాలనాగు ఆ వింతవృక్షం దగ్గిరకు వచ్చి ఆగింది. చంద్రవర్మ కూడా అక్కడికి వచ్చేంతలో వృక్షం మీది నుంచి మరింత భయంకరంగా అరుపులు రాసాగినై. చంద్రవర్మ గుండె రాయి చేసుకున్నాడు. ఒకవేళ కాలనాగు తనను మోసగించి హతమార్చ దలిచినా తను చేయగలిగిందేమీ లేదు. ఈ అడవి ప్రవేశిస్తూనే తను మాంత్రికురాలి శక్తికి లోబడిపోయాడు. తన దేహ బలం గాని, ఒరలోని కత్తిగాని యీ మంత్ర తంత్రాల బారి నుంచి తనను రక్షించలేవు. ఈ నిమిషంలో తనకు మేలుగానీ, కీడుగానీ జరగటం సంభవిస్తే అదంతా మాంత్రికురాలి ఆజ్ఞలవల్లనే జరుగుతుంది.

చంద్రవర్మ యిలా ఆలోచిస్తున్నంతలో కాలనాగు అతడికి మరింత దగ్గిరగా వచ్చి, తలలు ఎత్తి వృక్షం కేసి సంజ్ఞ చేయసాగింది. సర్పం తనను వృక్షం ఎక్కమంటున్నదని చంద్రవర్మ గ్రహించాడు. అతడు ఒరలో నుంచి కత్తి దూసి నిర్భయంగా చెట్టును సమీపించి దానితో చెట్టు బోదెను ఒక్కసారి గట్టిగా పొడిచాడు. ఆ వెంటనే అడవి దద్దరిల్లేలా హాహాకారాలు వినిపించినై. కాలనాగు భయంతో వణికిపోతున్నదానిలా శరీరాన్ని కుంచించి



చంద్రవర్మ ముందుకు వచ్చింది. చంద్ర వర్మ యివేమీ గమనించే స్థితిలో లేడు. చెట్టున వేలాడుతూ తనను వికృత ధ్వనులతో భయపెట్ట చూస్తున్న జంతువులా, పక్షులా తలలను తన కత్తితో నరికి కింద పడ కొట్టటానికి అతడు నిశ్చయించుకున్నాడు.

కాలనాగు చెట్టు బోదెవద్దకు వెళ్ళి, శరీరాన్ని దానికి చుట్టబెట్టి కొమ్మలకేసి ఓమారు చూసింది. అది చెప్పదలిచినదేదో గ్రహించినవాడిలా చంద్రవర్మ చరచరా చెట్టు మీదికి పాకాడు. ఈలోపల వృక్షానికి వేలాడుతున్న తలల నుంచి వికృతమైన అరుపులు ఎడతెరిపిలేకుండా వినపడసాగినై. చంద్రవర్మ నిర్భయంగా కొమ్మలలోకి వెళ్ళి తన కత్తితో పెద్దపులి తలలా వుండి కోరలు సాచి భయపెడుతూన్న ఒక తలను కొమ్మ నుంచి నరికాడు. మరుక్షణం అది దభీమంటూ కింద పడిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యానికి అంతు లేదు. భూమి మీద పడిన ఆ పెద్దపులి శిరస్సు పండులా మారిపోయింది.

చంద్రవర్మ గబగబా చెట్టు దిగి వచ్చేంతలో, కాలనాగు ఆ పండును నోట కరుచుకుని అతడికేసి తిరిగింది. చంద్రవర్మ ఆ పండును తీసుకుని గట్టిగా కొరికి చూశాడు. మరుక్షణం కాలనాగు పెద్దగా నవ్వుతున్నట్టు అతడికి వినబడింది. చంద్రవర్మ దానికేసి తిరిగి చూశాడు.

"చంద్రవర్మా, యిప్పుడు తెలిసిందా, యీ వృక్షానికి వేలాడుతున్న వింత తలల సంగతి?" అన్నది కాలనాగు.

ఆ మాటలతో చంద్రవర్మకు అంతా అర్థం అయిపోయింది. తను పండును కొరుకుతూ వుండగానే తనకు కాలనాగు మాట్లాడే మాటలు తెలిసిపోయినై. ఆ క్షణం వరకూ అది చేసే ధ్వని కేవలం పాము బుసలాగే వుంది.

"ఆ పండును కొరకటంతో నీకు పశు పక్ష్యాదుల భాష అవగతం అయింది. మాంత్రికుడైన శంఖుణ్ణి చేరటానికి

అతణ్ణించి అపూర్వశక్తులు గల శంఖాన్ని తస్కరించటానికీ యిది ఎంతగానో తోడ్పడుతుంది. అతడి భృత్యుడైన వింత అగ్నిపక్షి నుంచి ప్రమాదం రాకుండా నువు మసులుకోవలసి వుంటుంది. ఇప్పుడు నీవు అన్ని జీవరాసుల భాషలనూ అర్థం చేసుకోగలవు గనక, నీ ప్రయత్నంలో విజయం సాధించే అవకాశం వుంది,'' అన్నది కాలనాగు.



చంద్రవర్మలో ఎక్కడలేని ఉత్సాహం వెల్లివిరిసింది. అతడు కాలనాగు కేసి కృతజ్ఞత ఉట్టిపడే కళ్ళతో చూస్తూ, ''కాలనాగూ! నువ్వు నాకు చాలా గొప్ప సహాయం చేశావు. ఇందుకు ప్రతిగా నానుంచి నువ్వు కోరుతున్న దేమిటి?'' అని అడిగాడు.

కాలనాగు విచారంగా తలలను కిందికి వాల్చి, ''నువ్వు నాకు చేయవలసిన సహాయం ఏమంత పెద్దదికాదు. అయినా, నువ్వు శంఖుణ్ణించి ఆ అపూర్వశక్తులు గల శంఖాన్ని తెచ్చేవరకూ నేను వేచి వుండవలసి వుంది,'' అన్నది.

కాలనాగు యిలా జవాబిచ్చేసరికి, చంద్రవర్మకు అది అడగదలిచిన సహాయం ఏదో యిప్పుడే తెలుసుకోవాలని కోర్కె పుట్టింది. అతడు కాలనాగు కేసి అనుమానంగా చూస్తూ, ''కాలనాగూ, నువ్వు నిజంగా సర్పానివా? లేక మానవుడివా?'' అన్నాడు.

''నేను ఒకప్పుడు సర్పాన్ని కాదు; మానవుణ్ణే. శంఖుడికి శిష్యుడిగా వుండే వాణ్ణి. అతడు పంపగా కాపాలినికి హాని చేయటానికి వచ్చి, ఆమెకు దొరికిపోయి యిలా పామునైపోయాను. ఆ రోజు నుంచీ నన్ను ఆమె భృత్యుడుగా ఉపయోగించుకుంటున్నది. నీవు నీ ప్రయత్నంలో విజయం సాధించి వచ్చినట్టయితే, నన్ను యీ తుచ్ఛ జీవితాన్నుంచి కాపాడగలవు,'' అన్నది కాలనాగు విచారంగా.

''ఈమాత్రపుదానికి నువ్వు అంతకాలం వేచివుండ నవసరం లేదు. ఇప్పుడే వెను



వుండటం నాకేమంత కష్టం కాదు.'' అన్నది కాలనాగు.

చంద్రవర్మకు కాలనాగు మాటల్లో సత్యం ఉన్నట్టు తోచింది. ఈ మాంత్రికులూ, మంత్రగత్తెలూ నమ్మదగినవారు కారు. ఏ క్షణంలో వాళ్ళు ఎవరిని గురించి ఎలాంటి అనుమానాలకు గురి అవుతారో ఊహించటం కష్టం. చంద్రవర్మ యిలా ఆలోచించి చెట్టు దగ్గిర నుంచి ముందుకు కదిలాడు. కాలనాగు తిరిగి ఎప్పటిలాగా అతడికి ముందుండి దారి చూపసాగింది.

సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు వాళ్ళిద్దరూ దట్టంగా వున్న అడవి ప్రాంతాన్ని దాటగలిగారు. ఎదురుగా పెద్ద పెద్ద కొండలూ లోయలూ కనిపించినై. ఆ ప్రాంతాల కూడా చెట్లూ పొదలూ వున్నవి గాని, అవి అంత చిట్టడవిలా కనిపించటం లేదు.

''చంద్రవర్మా! ఇక నేను వెనక్కు తిరిగిపోతాను. కాపాలిని ఆజ్ఞప్రకారం నిన్ను యీ అడవి దాటించాను. ఇక ముందుకు నీవు ఒంటరిగా వెళ్ళవలసిందే! ఆ కనిపించే కొండలూ, కనుమల్లో నువ్వు అడుగడుగునా ప్రమాదాలను ఎదుర్కొవలసి రావొచ్చు. కాని, నువ్వు దిట్టతనం కోల్పోకపోతే, నీకు వచ్చిన పశుపక్ష్యాదుల

దిరిగి కాపాలిని దగ్గిరకు వెళదాం. ఆమె నా మాటను తోసివేయలేదు. నీకు తిరుగా మానవరూపం ప్రసాదించవలసిందిగా నేను ఆమెను కోరతాను.'' అన్నాడు చంద్రవర్మ.

ఇందుకు కాలనాగు అంగీకరించలేదు. ''కాపాలిని సంగతి సొంతంగా నీకు తెలియదు, వర్మా! వట్టి అనుమానం మనిషి. మనిద్దరమూ ఏకమై తనకేదో ద్రోహం తలపెట్టామని ఆమె భావించినా భావించవచ్చు. అలా జరిగితే, నాతోపాటు నీకూ మరింతగా కీడుజరుగుతుంది. ఇంతకాలంగా యీ సర్పజీవితం గడుపుతున్నాను. మరి కొద్ది రోజులు వేచి

భాషవల్ల అన్ని గండాలనూ గడిచి, తప్పక విజయం సాధించగలవు,'' అన్నది కాలనాగు.

ఆ తరవాత చంద్రవర్మ దగ్గిర సెలవు తీసుకుని కాలనాగు వచ్చిన మార్గాన బుసలుకొడుతూ బయలుదేరింది. చెట్లలో అది కనబడుతున్నంతవరకూ దానికేసి చూసి, చంద్రవర్మ పెద్దగా నిట్టూరుస్తూ తను పోవలసిన మార్గం కేసి నడిచాడు.

మార్గం అంతా చిన్నా పెద్ద రాళ్ళతోనూ, ముళ్ళ పొదలతోనూ నిండి వున్నది. అక్కడక్కడా ఆకాశాన్నంటుతున్న మహా వృక్షాలు వున్నవి. ఆ ప్రాంతాల తిరుగాడే మృగాలూ, పక్షులూ చేసే కలకలనాదం చంద్రవర్మకు స్పష్టంగా వినబడుతున్నది. కాని పూర్వంలా కాకుండా యిప్పుడా ధ్వనులలో అతడికి అవి మాట్లాడుకునే మాటలు అర్థం అవుతున్నవి. ఏదో ఒక కొత్త జీవి తమ నివాస ప్రాంతాలలో తిరుగాడుతున్నట్టుగా అవి ఒకదాని నొకటి హెచ్చరించుకుంటున్నవి.

సూర్యుడు నడినెత్తి నుంచి పడమటికి వాలేవరకూ చంద్రవర్మ సూటిగా ఉత్తరపు దిక్కు కేసి నడిచాడు. అసరికి అతడికి ఆయాసంతోపాటు, ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. అతడు ఒక పెద్ద చెట్టు నీడకు వెళ్ళి దాని బోదెకు నడుం వాల్చి



కూర్చుని చుట్టూ కలయచూశాడు. కను చూపు మేరలో ఎక్కడా ఫలవృక్షాలు వున్న సూచనలు లేవు. ఏవైనా దుంపలూ, కందమూలాలూ తిని కడుపు నింపుకో టానికైనా అక్కడ ముళ్ళపొదలూ, రాళ్ళ గుట్టలూ తప్ప మరేమీ కనిపించలేదు.

''ఇక్కడ కాలం వృథాపుచ్చి లాభం లేదు. ఇంకా మరికొంత ముందుకు వెళితే, ఎక్కడైనా ఫలవృక్షాలు కనబడవచ్చు.'' అనుకుంటూ చంద్రవర్మ చెట్టు నీడనుంచి లేచి బయలుదేరాడు. అతడు కొంతదూరం నడిచి ఒక పెద్దరాయి మలుపు తిరిగేసరికి ఎదురుగా ఫలభారంతో వంగిపోయిన అనేక వృక్షాలు కనిపించాయి. చంద్ర

వర్మకు ఎక్కడలేని ఆనందం కలిగింది. అతడు చిన్న చిన్న రాళ్ళనూ, ముళ్ళ పొదలనూ తప్పించుకుంటూ వేగంగా ముందుకు నడిచాడు. ఒకటి రెండు నిమిషాలు గడిచేసరికి శరీరాన్ని, ఏవో వేడిగాడ్పులు తాకినట్టయింది. చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ మరికొంత ముందుకు వెళ్ళాడు. అతడు నిలబడివున్న చోటుకు దిగువగా ఒక పెద్ద వాగు కళ పెళ లాడుతూ వేడి పొగలు వెడలగ్రక్కుతూ ప్రవహిస్తున్నది.

చంద్రవర్మ ఆ వింత వాగును చూస్తూనే నిర్విణ్ణుడయాడు. ఎక్కడో అగ్నిపర్వతం నుంచి ఆ వేడినీరు ప్రవాహం కట్టి వేడి గాడ్పులు వెదజల్లుతూ జాలు వారుతున్న దని అతడు గ్రహించాడు. తను ఆకలికి మాడి చావకుండా వుండాలంటే, ఎట్టి పరిస్థితులలోనైనా తను యీ వేడినీటి వాగును దాటక తప్పదు. ఫలభారంతో వంగివున్న వృక్షాలన్నీ వాగుకు అవతలి ఒడ్డున వున్నవి.

ఏమి చేయటమా అని చంద్రవర్మ ఆలోచించేంతలో ఒక మహాసర్పం మిట్టగా వున్న ప్రదేశాన్నుంచి నిలువునా తాడి చెట్టులా లేచి తలభాగం వాగుకు అవతల పడేలా వాలింది. తరవాత తలతో ముందుకు పాకుతూ, తోకను కొంచెం కొంచెంగా కదిలిస్తున్నది. అదే సమయంలో నాలుగైదు కోతులు చెట్ల మీది నుంచి దిగి, వాగుకు అడ్డంగా తాగాడిలా వున్న సర్పం మీది నుంచి నడిచి, అవతలి వైపుకు పరిగెత్తినై.

తను ఈ వేడినీటి వాగును దాటాలంటే, ఆ కోతులలాగే సాహసించి, ఆ పెనుబాము వెన్నుమీదుగా అవతలికి పరిగెత్తవలసి వుంటుందని చంద్రవర్మ గ్రహించాడు. ఆ ప్రయత్నం కూడా పాము తన శరీరాన్ని అవతలి ఒడ్డుకు లాక్కోక ముందే చేయాలి. ఇలా అనుకుంటూ చంద్రవర్మ వున్న చోటు నుంచి ఒక్క ఉరుకున పాము వున్న చోటుకు వెళ్ళి, దాని వెన్ను మీదుగా అవతలి ఒడ్డుకు పరిగెత్తసాగాడు. —(ఇంకావుంది)






# మంత్రశక్తులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి సమయంలో హాయిగా, నీ శయనాగారంలో హంసతూలికాతల్పం మీద నిద్రించవలసినవాడివి, భీతిగొల్పే ఈ శ్మశానంలో, ఎవరి మేలుకోరి తిరుగుతున్నావో, నాకర్థం కావడం లేదు. రాజులు స్వార్థపరులనీ, తమకు మేలు చేసిన ఎటువంటి ఉత్తమ మానవుడికైనా, నిర్దాక్షిణ్యంగా కీడు చేయగలరనీ, లోకం ఎరిగినదే! ఒకవేళ నువ్వు, నీ స్వార్థం కోసమే యింతగా కష్టాల కోరుస్తున్నావా? అదే నిజమైతే, నీలాంటి రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



శరభయ్య అనే మాంత్రికుడు, సూర్యోదయం వేళ నదిలో శుచిగా స్నానం చేసి, నది ఒడ్డున వున్న ఒక పెద్ద ఊడలమర్రి కింద పూజ ముగించుకుని బయలుదేర బోతూండగా, అక్కడికి ఒక వ్యక్తి వచ్చాడు. అతడి వేషధారణను బట్టి, ఎవరైనా యిట్టే అతడు మాంత్రికుడని ఊహించుకుంటారు.

శరభయ్య అతడి ముఖం కేసి ఆశ్చర్య పోతూ తేరిపారచూసేంతలో, ఆ వచ్చిన వాడు, "శరభయ్య అనే మంత్రాలు నేర్చిన వాడివి, నువ్వే గదా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు శరభయ్య కోపం తెచ్చుకుని, "మంత్రాలు నేర్వడం కాదు, మంత్రశాస్త్రాన్ని ఆపోసనపట్టినవాణ్ణి! నేను మహామాంత్రికశక్తులు కలవాడినన్న సంగతి, ఈ రాజ్యంలో చాలామందికి తెలుసు," అన్నాడు.

"అలాగా! నేనీ పొరుగు రాజ్యం వాణ్ణి. మహాద్భుతశక్తులు సాధించిన మంత్రవేత్తనని, ఆ రాజ్యంలో ప్రతి ఒక్కరికీ తెలుసు. నా పేరు, దేవయ్య," అన్నాడా వ్యక్తి.

"ఒకే కాలంలో యిద్దరు సమానశక్తి వంతులైన మాంత్రికులుండడం, అసంభవం!" అన్నాడు శరభయ్య.

"ఆ మాట నిజం! నువ్వు, నాకంటె ఎక్కువ అద్భుతశక్తులు కలవాడివని, రుజువు చెయ్యగలవా?" అని ప్రశ్నించాడు దేవయ్య.

"చెయ్యగలను. నేను తలుచుకుంటే, తాగడానికి నీరు లేకుండా ప్రజలను మల మల మాడ్చేయగలను," అన్నాడు శరభయ్య.

"నేను క్షణాల మీద నీరు పుట్టించి, ఆ ప్రజల ప్రాణాలు కాపాడగలను," అన్నాడు దేవయ్య.

ఆ జవాబుకు శరభయ్య పౌరుషపడి, "నేనేనా తీసిపోయింది! గడ్డిపరక కూడా మొలవని బీడుల్ని, సుక్షేత్రాలను చేయగలను," అన్నాడు.



''ఓస్, అంతేకదా! నేను వాటిని క్షణంలో బుగ్గి చేసెయ్యగలను,'' అన్నాడు దేవయ్య.

శరభయ్య విసుగుపడుతూ, ''ఇన్ని మాటలెందుకు? నా అద్భుతశక్తుల్లో నీకు నమ్మకం కలిగించడానికి ఏం చెయ్యాలో చెప్పు. ఈ క్షణంలోనే నా శక్తి నిరూపిస్తాను,'' అన్నాడు.

దేవయ్య తాపీగా, ''నువ్వు నిజంగా అంత గొప్ప మంత్రగాడివైతే, దీర్ఘవ్యాధులతో బాధపడేవాళ్ళకు నీ మంత్రశక్తితో త్వరగా స్వస్థత కలిగించగలవా?'' అని అడిగాడు.

శరభయ్య వెంటనే, ''స్వస్థత కలిగించగలను,'' అన్నాడు.

''నీరు సృష్టించగలవా?'' అన్నాడు దేవయ్య.

శరభయ్య ఆ పని చేయగలనంటూ తల ఊపాడు.

దేవయ్య ఒక క్షణం ఆగి, "మనుషుల్లో ఎవరు మంచి బుద్ధిగల వాళ్ళో, ఎవరు ద్రోహబుద్ధికలవాళ్లో ఎంచి చెప్పగలవా?'' అని అడిగాడు.

శరభయ్య అదీ చేయగలనంటూ తల వూపాడు.

అప్పుడు దేవయ్య, ''ఎదుటివాళ్ళు, తమ మనసుల్లో అనుకునేవి సరిగ్గా అంచనావేసి బయట పెట్టగలవా?'' అన్నాడు.

శరభయ్య ఆ పనీ చేయగలనని, ''నన్ను యిన్నివిధాల పరీక్షిస్తున్నావు గదా, నేను చేస్తానన్న అద్భుతాలు నువ్వు చేయగలవా?'' అని అడిగాడు.

''ఓఁ, తప్పకుండా!'' అన్నాడు దేవయ్య.

''ఉత్తిమాటలతో లాభం లేదు. పందెం వేద్దాం,'' అన్నాడు శరభయ్య.

"ఏమిటాపందెం?" అన్నాడు దేవయ్య.

''అది నీకే వదిలేస్తున్నాను. ఎలాంటి పందానికైనా, నేను సిద్ధం,'' అన్నాడు శరభయ్య.

దేవయ్య ఒక క్షణం ఆలోచించి, "ఓడినవాడు, గెలిచినవాడికి దాసోహం అనాలి. ఆ తరవాత మంత్రశక్తుల జోలికి పోకూడదు," అన్నాడు.

"ఈ పందెం, నాకిష్టమే!" అన్నాడు శరభయ్య.

"అయితే, చిన్న షరతు. ముందుగా, నీ అద్భుతాలు ప్రదర్శించిన తరవాతే, నేను నా అద్భుతాలు ప్రదర్శిస్తాను," అన్నాడు దేవయ్య.

అందుకు శరభయ్య ఒప్పుకున్నాడు.

మంత్రగాళ్ళు యిద్దరూ కలిసి మిట్ట మధ్యాహ్నం వేళకు ఒక గ్రామం చేరారు. ఎంతోకాలంగా అక్కడ వర్షాలు లేనందున పొలాలన్నీ బీడుపడి వున్నవి. చెరువులూ, బావులూ పూర్తిగా ఎండిపోవడంతో, ప్రజలు తాగే నీరు కూడా లేక కటకట లాడి పోతున్నారు.

"సరే, యిక్కడ నీ మంత్రశక్తులు ఏపాటివో ప్రదర్శించు, చూస్తాను!" అన్నాడు దేవయ్య.

శరభయ్య కొద్ది నిముషాలు కళ్ళు మూసుకుని ఏదో స్మరించాడు. తరవాత కుడిచేతి చూపుడువేలిని గాలిలో తిప్పి, కళ్ళకు తాకించుకున్నాడు. ఆ మరు క్షణం ఫెళఫెళా రావాలతో ఆకాశంలో మబ్బులు కమ్మి, కుండపోతగా వాన కురిసింది.

విజయగర్వంతో దేవయ్య వంక చూశాడు, శరభయ్య.



దేవయ్య అతణ్ణి మెచ్చుకుని, మొదట్లో ఏమో అనుకున్నాను గాని, "నువ్వు అంతో, యింతో మంత్రశక్తులు కలవాడి వన్నమాట, నిజం!" అన్నాడు నవ్వుతూ.

"నాది అంతో, యింతో మంత్రశక్తా? అవమానం! చూస్తాను, నీ మంత్రశక్తితో వానకురిపించు." అన్నాడు శరభయ్య.

దేవయ్య చిరునవ్వు నవ్వి, "షరతు సంగతి మరిచిపోయావా? ముందు నీ మంత్రశక్తులు ప్రదర్శించాలన్న నియమం వున్నదిగదా," అన్నాడు.

"సరే. అలాగే కానివ్వు." అన్నాడు శరభయ్య.

"రాజధానీనగరం వెళదాం. ఈ దేశాన్నేలే రాజు కూతురు ఎంతో కాలంగా కుదరని వ్యాధితో మంచం పట్టి వున్నదని, విన్నాను. నీ మంత్రశక్తితో, ఆమె వ్యాధి కుదుర్చు, చూద్దాం!" అన్నాడు దేవయ్య.

ఇద్దరూ రాజధాని చేరి, రాజదర్శనం చేసుకున్నారు. రాజు వాళ్ళను తన కుమార్తె వున్న గదికి తీసుకుపోయాడు. శరభయ్య రాకుమారి మంచం పక్కన కొంతసేపు నిలబడి, చూపుడువేలును కళ్ళకు తాకించి, కొద్ది క్షణాలు ఏదో స్మరించాడు.

కొన్ని క్షణాలు గడిచేసరికి, రాకుమారి నవ్వుతూ మంచం మీద లేచి కూర్చున్నది. ఎంతో కాలంగా ఆమెను పీడిస్తున్న వ్యాధి మటుమాయమైంది. రాజు చాలా సంతోషించాడు.





దేవయ్య, రాజుతో కొద్దిసేపు ఏకాంతంగా మాట్లాడి, శరభయ్య దగ్గిరకు వచ్చి, "రాజుగారికి తన పరివారంలో కొందరు విద్రోహులున్నారని, అనుమానంగా వున్నదట. వాళ్ళెవరో చెప్పు." అన్నాడు.

శరభయ్య, రాజుగారి పరివారజనాన్నీ, సైనికులనూ పరిశీలించి, వాళ్ళల్లో అయన మీద కుట్ర పన్నుతున్నవాళ్ళను, సౌంజ్ఞల ద్వారా దేవయ్యకు చూపించాడు. దేవయ్య ద్వారా సంగతి విన్న రాజు, ఆ కుట్రదారులను తన అంగరక్షకులచేత బంధింపచేసి, కారాగారంలో వేయించాడు.

తరవాత ఆయన సభ తీరి వుండగా, దేవయ్య, శరభయ్య మంత్రశక్తులను గొప్పగా పొగిడి, అతడితో, "మన షరతు ప్రకారం, నువ్వు మరొక్కసారి నీ మంత్రశక్తుల్ని ప్రదర్శించవలసి వున్నది. నువ్వా పని చేయగలిగితే, నేను నువ్వు కోరిన విధంగా, నా మంత్రశక్తులు చూపగలను. ఇప్పుడు, నేను మనసులో ఏం అనుకుంటున్నానో చెప్పు ?" అన్నాడు.

శరభయ్య రెండు క్షణాలు కళ్ళు మూసుకుని, చూపుడు వేలిని కళ్ళకు తాకించి, కళ్ళు తెరుస్తూనే, దేవయ్య కేసి రౌద్రంగా చూస్తూ, "నీ మనసులో ఏమనుకుంటున్నావో చెప్పమన్నావా ? ఆ సంగతి నిజం చెప్పినా, కాదని, నేను ఓడిపోయినట్టు అనదలిచావు. తరవాత ఎలాగైనా నా చూపుడువేలిని ఖండించి, నాకు మంత్రశక్తులు లేకుండా చేయదలిచావు!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే దేవయ్య నిర్ఘాంతపోయాడు. శరభయ్య గట్టిగా పళ్ళు కొరుకుతూ, "దుష్టుడా, నువ్వెవరో కూడా నాకు తెలిసిపోయింది. నువ్వు సాటి మాంత్రికుడివి కాదు. నీ పేరు దేవయ్య కాదు; దేవదత్తుడు. ఈ దేశపు మంత్రివి. ఏ మందులకూ లొంగని రాకుమార్తె వ్యాధిని నాచేత నయం చేయించేందుకు, ఈ కపటనాటకమంతా ఆడావు !" అన్నాడు.

అ మరుక్షణం రాజు సౌంజ్ఞ చేయగానే, నలుగురు భటులు శరభయ్య మీదపడి, ముందుగా అతడి పెడరెక్కలు విరిచికట్టి, శిరస్సును ఒక గోనెసంచీలో దూర్చి, తాళ్ళతో బిగించారు.

"వీణ్ణి వెంటనే వధ్యస్థానానికి తీసుకుపోయి, శిరశ్ఛేదం చెయ్యండి!" అని రాజు భటులకు ఆజ్ఞయిచ్చాడు.

భటులు శరభయ్యను అక్కడి నుంచి లాక్కుపోయారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శరభయ్యకు రాజు శిరశ్ఛేదశిక్ష విధించడం అన్యాయం కాదా? ఏ మందులకూ లొంగని రాకుమారి దీర్ఘవ్యాధిని, అతడు తన మంత్రశక్తి ద్వారా కుదిర్చాడు. అతడికి ఆగ్రహం కలిగింది రాజు మీద కాదు; సాటి మాంత్రికుణ్ణంటూ అబద్ధాలాడిన మంత్రి దేవదత్తుడి మీద. అలాంటప్పుడు రాజు, శరభయ్యను ఘనంగా సత్కరించకపోగా, యిలా మరణశిక్ష విధించడం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజైనవాడు, తన క్షేమం, కుటుంబ క్షేమంతోపాటు, దేశప్రజల క్షేమం కూడా చూడవలసి వుంటుంది. శరభయ్యకున్న మంత్రశక్తులు సాటిలేనివి. కావాలనుకుంటే అతడు వాటిని పదుగురి మేలుకోసం, కీడుకోసం కూడా యథేచ్ఛగా ఉపయోగించగలడు. అతడి కిప్పటికే మంత్రిపట్ల బాగా శత్రుభావం ఏర్పడింది. మంత్రిని శత్రువుగా భావించినవాడు, రాజును విడిచిపుచ్చుతాడన్న నమ్మకం ఏమీ లేదు. అలాంటి అద్భుత మంత్రశక్తులున్నవాడు, ఏనాటికైనా తప్పకుండా ప్రమాదకారుడు కాగలడని గ్రహించడం వల్లనే, రాజు శరభయ్యకు శిరశ్ఛేదశిక్ష విధించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# రహస్యం

రామాపురానికి కట్టుబట్టలతో వచ్చిన రమణయ్య, ఏడాది తిరక్కుండా ఎకరం పొలం సంపాయించాడు. మరొక నాలుగేళ్ళకు, ఆ గ్రామంలో వున్న ధనికుల్లో ఒకడనిపించుకున్నాడు.

అదే గ్రామంలో వుండే రాజయ్యకు, రమణయ్య యింత త్వరగా ఎలా ధనికుడు కాగలిగాడో ఎంత ఆలోచించినా అంతుపట్టలేదు. ఆ రహస్యమేమిటో అతణ్ణే అడిగి తెలుసుకుందామని రాజయ్య, ఒకనాటి చీకటి పడుతున్నవేళ రమణయ్య ఇంటికి వెళ్ళాడు.

ఆ సమయంలో రమణయ్య, ఒక చిన్న దీపపుబుడ్డి వెలిగించి గూట్లో పెడుతున్నాడు. ఆయన రాజయ్యను చూస్తూనే ఆదరంగా పలకరించి, "ఏదో పని మీద వచ్చినట్టుంది!" అన్నాడు.

"మరేమంత పెద్ద పని కాదు," అంటూ రాజయ్య వచ్చిన పని చెప్పి, "ఒకే గ్రామం వాళ్ళం గదా! ఆ రహస్యం ఏమిటో నాకు చెప్పగూడదా?" అని అడిగాడు.

"ఇందులో రహస్యం ఏముంది?" అంటూ రమణయ్య, ఒక చిన్న చాప తెచ్చి వేసి రాజయ్యను కూర్చోమని, తాను వెళ్ళి దీపపుబుడ్డిని ఆర్పి వచ్చి, రాజయ్య పక్కన కూర్చున్నాడు.

రాజయ్య ఆశ్చర్యంగా, "వెలుగుతున్న దీపం ఆర్పేసి వచ్చారు. అలా ఎందుకు చేశారో ముందు కాస్త చెప్పండి," అన్నాడు.

రమణయ్య తాపీగా, "మనం యిలా తీరిగ్గా కూర్చుని మాట్లాడుకోవడానికి కూడా, ఆ బుడ్డిలోని చమురు ఖర్చు చేయాలంటారా?" అని అడిగాడు.

అది వింటూనే రాజయ్య చటుక్కున లేచి, "మరి నేను వెళ్ళివస్తాను!" అన్నాడు.

"ఏదో రహస్యం తెలుసుకోవాలని వచ్చారు గదా?" అన్నాడు రమణయ్య.

"ఆ రహస్యం మీ నోటమ్మట వినక్కరలేకుండానే, నేను గ్రహించాను," అన్నాడు రాజయ్య వెళ్ళిపోతూ.

—కమలిని





# పీడ విరగడ

గోపతికి పట్టణంలోని ప్రభుత్వ కచ్చేరీలో ఉద్యోగం. మనిషి చాలా మొహమాటస్థుడు. అతడు పెళ్ళి చేసుకుని భార్యను కాపరానికి తెచ్చుకున్నాడు. వింతేమంటే, అతడి భార్య సునంద కూడా పెద్ద మొహమాటస్థురాలు.

ఆమె కాపరానికి వచ్చిన మొదటి రోజున, వంట విషయంలో భార్యాభర్తలిద్దరూ చాలా మొహమాటపడిపోయారు. గోపతి దిక్కులుచూస్తూ, భార్యతో, "కొత్త గదా! నీకు వంట చేయడం కొంత యిబ్బందిగా వుండొచ్చు. ఈ రోజు పూట కూళ్ళ ఇంటి నుంచి భోజనం తెప్పించుకోవడం ఎలా వుంటుంది?" అని అడిగాడు మెల్లగా.

భర్తను వంటకు కావలసిన వస్తువులు తెమ్మని చెప్పేందుకు తటపటాయిస్తున్న సునంద, చిన్న గొంతుతో, "మీరు వంటకవసరం అయిన సామానులు తెస్తే, వంట చేయడం, నాకేం యిబ్బంది కాదు," అన్నది.

ఈ మొహమాటం దంపతుల సంసార యాత్ర, ఆ విధంగా ప్రారంభమయింది.

ఒకనాటి సాయంత్రం వాళ్ళిద్దరూ, పట్టణం శివార్లలో వున్న శివాలయానికి వెళ్ళి, చీకటిపడి తిరిగి వస్తున్నారు. దారిలో నడవలేని స్థితిలో వున్న ముసలివాడొకడు, గోపతితో, "బాబూ, కళ్ళు తిరిగి పడిపోయేలా వున్నాను. కాస్త నీ చెయ్యి ఆసరా యిచ్చి పుణ్యం కట్టుకో," అన్నాడు.

గోపతి ఆ ముసలివాడికి చెయ్యి ఆసరా యిచ్చి నడిపించసాగాడు. ఇంతలో ఆ దారి వెంట వస్తున్న యిద్దరు పెద్ద మనుషులు, గోపతి కేసి కోపంగా చూస్తూ, "చూడబోతే చదువుకున్నవాడిలా

మాచిరాజు కామేశ్వరరావు



వున్నావు. ఆ మాత్రం జ్ఞానం లేకపోతే ఎలా! ముసలి తండ్రికి నువు యిచ్చే గౌరవం అదా!'' అంటూ గట్టిగా చీవాట్లు పెట్టి, ఆ పక్కనే పోతున్న బాడుగబండిని కేక వేశారు.

ఆ ముసలివాడు తన తండ్రి కాదని చెప్పేందుకు గోపతి ఒక క్షణం మొహమాటపడి, ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, బండివాడు ముసలివాణ్ణి బండెక్కించి, ''అలా చూస్తారేం, ఎక్కండి త్వరగా,'' అన్నాడు గోపతి, సునందలతో.

మారుపలుక్కుండా భార్యాభర్తలు బండి ఎక్కి కూర్చున్నారు. వాళ్ళు ఇల్లు చేరేసరికి జ్వరంతో ముసలివాడి ఒళ్ళు కాలిపోతున్నది. సునంద ముసలివాడికి పడక సిద్ధం చేసింది; గోపతి వెళ్ళి వైద్యుణ్ణి తీసుకువచ్చాడు.

నాలుగు రోజులు గడిచి, గోపతికి వంద రూపాయిలు ఖర్చయ్యాక, ముసలివాడు పూర్తిగా కోలుకున్నాడు. అయితే, అతను ఆ భార్యాభర్తలతో, ఆ ఇల్లు వదిలి వెళ్ళే ప్రసక్తి తేలేదు.

మరి నాలుగు రోజులు చూసి గోపతి, భార్యతో, ''ఈ ముసలివాడు ఎప్పుడు వెళతాడో ఏమో!'' అన్నాడు.

''ఆయన్నే అడగకూడదా?'' అన్నది సునంద.

''రేపు భోజనాలయాక అడుగు,'' అన్నాడు గోపతి.

అలా అడగడం తనవల్ల కాదని భర్తకు చెప్పడానికి మొహమాటపడి, సునంద మెదలకుండా వూరుకున్నది.

ఇలా మరి రెండు రోజులు గడిచాక, ముసలివాణ్ణి తమ నోటితో వెళ్ళమని చెప్పడం తమకు సాధ్యపడదని భార్యాభర్తలు గ్రహించారు.

గోపతికి ఒక ఆలోచన వచ్చింది. అతను ముసలివాడితో, ''రేపు తెల్లవారుజామున, నేనూ సునందా వాళ్ళ పుట్టింటికి వెళుతున్నాం. అక్కడ ఒక వివాహానికి



హాజరుకావాలి. రెండు రోజుల తర్వాత గాని తిరిగి రాము,'' అన్నాడు.

''హాయిగా వెళ్ళి రండి. ఈ రెండు రోజులూ, నా భోజనం గురించి మీరు మొహమాటపడకండి. ఏదో నా తంటాలు నేను పడతాను,'' అన్నాడు ముసలివాడు తాపీగా.

ఈ జవాబు విని గోపతి ఉలిక్కి పడ్డాడు. చేసేదిలేక మర్నాడు పొద్దున భార్యను తీసుకుని, పట్టణంలో మరొక మూల వున్న సత్రంలో రెండు రోజుల పాటు గుట్టుగా కాలం గడిపి, తిన్నగా ఇంటికి తిరిగి వచ్చాడు. ఇక ఆ ముసలి వాడి పీడ ఎలా విరగడ అవుతుందో, ఎంత ఆలోచించినా, ఆ భార్యా భర్తలకు ఏమాత్రం అంతుపట్టలేదు.

ఒకనాటి రాత్రి వాళ్ళు ముసలివాణ్ణి గురించి మాట్లాడుకుంటూండగా, ము... గదిలో పడుకున్న ముసలివాడు లేచి వచ్చి, ''చూడండి, నన్ను గురించిన కబుర్లతో, మీ నిద్రలు పాడుచేసుకుని, నా నిద్రా చెడకొట్టవద్దు. నేనీ ఇల్లు వదిలి వెళ్ళేదిలేదు! ఆ రోజు రాత్రి, నన్ను మీ ఇంటికి తీసుకురాకుండా వుంటే, నేను హాయిగా ఎవరి ఇంటి అరుగు మీదనో చచ్చిపోయి వుండేవాణ్ణి. నన్ను బతికించి నందుకు, పోషించే భారం కూడా మీదే. కాదంటారా, యిప్పుడే వెళ్ళి మీ పెరటి బావిలో దూకి చస్తాను!'' అని చెప్పి వెళ్లి పడుకున్నాడు.

ముసలివాడు బతికున్నంతవరకూ, వాడి పోషణ బాధ్యత తమకు తప్పదని, ఆ భార్యాభర్తలు గ్రహించారు.

''జీతం డబ్బుల్లో నెలకు దాస్తున్న వంద రూపాయిలూ ఖర్చు పెట్టేస్తాను. ఒక వేళ మా నాన్న బతికి వుంటే, ఈ ఖర్చు ఎలాగూ తప్పేది కాదు గదా!'' అన్నాడు గోపతి.

''ఇద్దరికి ఎలానూ వంట తప్పదు. పోతే, మరి నాలుగు గుప్పెళ్ళ బియ్యం, ఇన్ని కూరగాయలూ, ఇంత కూరాకు.



వచ్చి సునందతో, "ఈ చచ్చుక బుర్లు ఎప్పటికి ముగిసేటట్టు ? నాకు భోజనం వడ్డించేట్టా, లేనట్టా ?" అంటూ విరుచుకు పడ్డాడు.

సునంద మారుమాట్లాడకుండా పోయి ముసలివాడికి వడ్డన చేసింది. వాడు తినడం ప్రారంభిస్తూ, "ఈ సొరకాయ కూరంటే, నాకిష్టం వుండదని నీకు లక్ష సార్లు చెప్పాను. అయినా, నా కోసం మరొక కూర చెయ్యవు !" అని కోపంగా విసుక్కుంటూ తినడం ముగించి, పోయి పడుకున్నాడు.

ఇది విన్న నందిని, సునందతో, "చూడబోతే, మీ మామగారు మహా కోపిష్ఠిలా వున్నాడు. మీ ఆయనకూడా, యీ లక్షణాలు రాలేదుగదా ?" అన్నది.

"ఆ ముసలతను, మా మామగారు కాదు. దారేపోయేవాణ్ణి తెచ్చి, శనిలా నెత్తికెక్కించుకున్నాం !" అంటూ సునంద స్నేహితురాలికి జరిగినదంతా చెప్పింది.

"మీ మొహమాటం యింత చేసిందన్న మాట !" అంటూ నందిని ఆశ్చర్య పోయింది.

"ఏం చెయ్యం చెప్పు ! గట్టిగా పొమ్మంటే, మా పెరట్లోని బావిలో దూకి చస్తానంటున్నాడు. అదే జరిగితే, పది

వంట చెయ్యడం ఏమంత శ్రమ కాదు లెండి," అన్నది సునంద.

ఆ రోజు గోపతి కచ్చేరీకి వెళ్ళగానే, అనుకోకుండా సునంద స్నేహితురాలు నందిని వచ్చింది. సునంద పెళ్ళి, తన అన్నగారి పెళ్ళి ఒకే రోజు జరగడంతో నందిని, సునంద పెళ్లికి రాలేకపోయింది. ఇప్పుడామె స్నేహితురాలి కొత్త కాపరం ఎలా వుందో చూసిపోదామని పనిగట్టుకు వచ్చింది.

నందినిని చూసి చాలా ఆనందపడింది సునంద. వాళ్ళు ఆ కబుర్లూ, యీ కబుర్లూ మాట్లాడుకోసాగారు. కొద్దిసేపు తరవాత ముసలివాడు వాళ్ళ దగ్గిరకు

మందిలో మా పరువేంకాను,'' అన్నది సునంద.

''ఇలా చస్తానంటూ బెదిరించేవాళ్లకు, చావంటే మహా చెడ్డభయం వుంటుంది. నేను చిటికెలో ముసలాడి పీడవిరగడ చెయ్యగలను. నువ్వు, నే చెప్పేదానికి అడ్డు చెప్పక, సరేనని తల వూపితే చాలు,'' అన్నది నందిని.

తరవాత ఆమె కొంచెం పంచదార బాగా నూరి పొట్లం కట్టి, తన దగ్గిర వుంచుకున్నది. ఎండవేడి తగ్గి బాగా చల్లబడినాక ముసలివాడు నిద్రలేచి, ఫలహారం కోసం వంటగది కేసి బయలు దేరాడు. అప్పుడు వంటగదిలో సునందతో పాటు వున్న నందిని, ముసలివాణ్ణి చూడనట్టుగా, ''సునందా, చచ్చిపోయే ముసలి వాణ్ణి బతికించినందుకు, అతణ్ణి పోషించే భారం మీదే అవుతుంది! అయితే, ఆ స్తోమతు మీకు లేదంటున్నావు. అటువంటప్పుడు, అతడు కనీసం సుఖంగా చచ్చి పోయేలా చూడడం, మీ ధర్మం కదా!'' అన్నది.

''ఆ మాట నిజమే!'' అన్నది సునంద.

''అవునా! నా దగ్గిర ఒక రకం విషం వున్నది. దాన్ని ఒక చిటికెడు ముసలాయన భోజనంలోనో, ఫలహారంలోనో కలుపు. వారం తర్వాత, ఆయన చేసిన పుణ్య పాపాలనుబట్టి—అటు స్వర్గమో, నరకమో చేరిపోతాడు. విషప్రయోగం జరిగినట్టు, ఆఖరికి ధన్వంతరిలాటి వైద్యుడు కూడా



కని పెట్టలేడు. ముసలాయనికూడా, ఏమాత్రం బాధా తెలియదు.'' అంటూ నందిని, తన దగ్గిర వున్న పంచదార పొట్లాన్ని సునంద కిచ్చింది.

వంటగది యివతల వుండి ఇదంతా విన్న ముసలాడికి కళ్ళు బైర్లుకమ్మినై. అతను వెనుదిరిగి తన సామాను సర్దు కుంటూ, ''సునంద అమ్మాయ్! నేను వెళుతున్నానని మనసు కష్టపెట్టుకోకు. ఈ వయసులో యిలా ఒకచోట పడివుండే కంటే, అలా తీర్థయాత్రలు చేస్తూ తిరగా లన్న బుద్ధి పుట్టింది. తెల్లవారి చెప్ప షురిచాను. రాత్రి కలలో ఏదో దేవత నన్నిలా హెచ్చరించింది. నేను వెళుతు న్నాను,'' అన్నాడు.

''అదేమిటీ! వారికి చెప్పకుండానే వెళతారా ? సరే, అంతగా వెళ్ళదలిస్తే, ముందు ఫలహారం చెయ్యండి,'' అన్నది సునంద.

ఫలహారం మాట వింటూనే ముసలి వాడు నిలువెల్లా కంపించిపోయి, ''క్షణం ఆలసించేందుకు లేదు. మళ్ళీ వర్షం వస్తుంది!'' అంటూ బయటికి వెళ్ళి పోయాడు.

ఆ సాయంత్రం గోపతి కచ్చేరీ నుంచి తిరిగి రాగానే, సునంద జరిగినదంతా అతడికి చెప్పి, ''ఈ నందిని పుణ్యమా అని, ఆ ముసలివాడి పీడవిరగడయింది,'' అన్నది.

గోపతి ఏదో అనబోయేంతలో నందిని కల్పించుకుని, ''ముందు మీ యిద్దరూ, మీలో వున్న, ఆ అతి మొహమాటం అన్న పీడను విరగడ చేసుకోవాలి. అంతో, యింతో పరోపకారబుద్ధి లేనివాడు, మనిషి అనిపించుకోడు. కాని, తాహతుకు మించిన పరోపకారం చిక్కులకు దారితీస్తుంది,'' అన్నది.

''ఈ సంగతి మేం అనుభవపూర్వ కంగా తెలుసుకున్నాం. అవునా?'' అంటూ గోపతి, భార్యకేసి చూశాడు.

సునంద చిరునవ్వుతో అవునన్నట్టు తలపూపింది.





# దురాచారం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు బ్రహ్మదత్తుడి కుమారుడుగా జన్మించాడు. అతనికి బ్రహ్మదత్త కుమారుడని పేరు పెట్టుకున్నారు. అతను తక్షశిలకు వెళ్ళి పదహారేళ్ళు నిండే లోపునే వేదాలూ, వేదాంగాలూ, ఉపనిషత్తులూ చదివాడు. అతను విద్య చాలించి తిరిగి రాగానే తండ్రి అతనికి యౌవరాజ్యాభిషేకం చేశాడు.

ఆ కాలంలో కాశీరాజ్యంలో ప్రజలు అనేక దేవతలను పూజించేవారు. అనేక జాతరలు చేసేవారు. జాతర జరిగినప్పుడల్లా గొర్రెలనూ, మేకలనూ, కోళ్ళనూ దేవతలకు బలి యిచ్చి, వాటి రక్తం నైవేద్యం పెట్టేవారు. బ్రహ్మదత్త కుమారుడు ప్రజల మూఢ విశ్వాసాలనూ, దురాచారాలనూ చూసి చాలా బాధపడేవాడు. "నేను రాజునయాక ఈ దురాచారాల నన్నిటినీ, ఒక్క చుక్క రక్తం రాల్చకుండా నిర్మూలిస్తాను," అని అతను ఆలోచన చేశాడు.

కాశీనగరం వెలపల ఒక మర్రిచెట్టుండేది. ఆ చెట్టులో ఒక దేవత ఉన్నదనీ, మొక్కుకున్నవాళ్ళకు ఆ దేవత పిల్లల నిస్తుందనీ, ఇతర కోరికలేవైనా ఉంటే ఈడేర్చుతుందనీ ప్రజలు నమ్మేవాళ్ళు.

ఒకనాడు బ్రహ్మదత్త కుమారుడు రథమెక్కి ఊరు వెలపల ఉన్న మర్రిచెట్టు వద్దకు వెళ్ళాడు. ఆ చెట్టు చుట్టూరా అనేకమంది స్త్రీలూ, పురుషులూ భక్తితో ప్రదక్షిణాలు చేస్తున్నారు. చెట్టుకు అంత దూరంలోనే యువరాజు రథం దిగి, చెట్టును పూలతో పూజించి, చెట్టు చుట్టూ మూడు ప్రదక్షిణాలు చేశాడు. ఆ తరవాత అతను తన రథమెక్కి ఊళ్ళోకి తిరిగి వెళ్ళిపోయాడు. అది మొదలు అతను

తరుచు ఆ మర్రిచెట్టు వద్దకు వెళ్ళి, క్షుద్ర దేవతలలో విశ్వాసం ఉండే మామూలు మనుషుల లాగే చెట్టును పూజిస్తూ, దాని చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ రాసాగాడు.

కొంతకాలం ఇలా గడిచాక ముసలి రాజు చనిపోయాడు. బ్రహ్మదత్త కుమారుడు కాశీరాజ్యానికి రాజయాడు.

రాజ్యాభిషేకం అయిన వెంటనే అతను నిండు పేరోలగం ఏర్పాటు చేసి అందులో ఈ విధంగా మాట్లాడాడు:

''నేను రాజు నెలా అయానో మీరెవరూ ఎరగరు. కాని, యువరాజుగా ఉన్న కాలంలో నేను ఊరి బయట ఉండే మర్రి చెట్టును పూజించి వస్తూ ఉండిన సంగతి మీరెరిగే ఉంటారు. నన్ను రాజును చేసినట్టయితే ఆ మర్రిచెట్టుకు వెయ్యి జీవాలను బలి ఇస్తానని మొక్కుకున్నాను. ఈనాటికి నా కోరిక ఈడేరింది. అన్న మాట ప్రకారం మర్రిచెట్టుకు తప్పకుండా బలి జరగాలి!''

ఈ సంగతి వినగానే సభికులంతా పరమానంద భరితులయారు. మంత్రులు, ''మహారాజా, తాము మర్రిచెట్టుకు ఏ జంతువులను బలి ఇస్తామనుకున్నారో సెలవిప్పించండి. వెంటనే అన్ని ఏర్పాట్లూ చేయిస్తాం!'' అన్నారు.

"నేను బలి యిస్తానని మొక్కుకున్నది జంతువులను కాదు—దేవతలకు జంతువులను బలి యిచ్చే మనుషులను. అటువంటివారిని వెయ్యిమందిని తీసుకురండి. నా మొక్కు చెల్లించుకుంటాను. ఈ రోజు లగాయతు ఎవరెవరైతే దేవతలకు బలులిస్తారో, వారు మర్రిచెట్టుకు బలి చేయబడతారని దేశమంతటా చాటింపించండి," అన్నాడు రాజు.

సభికులు నిర్విణ్ణులైపోయారు. కాని వారు బలులలో నమ్మకం ఉన్నవారే గనక ఏమీ అనలేకపోయారు. దేశమంతటా చాటింపు జరిగింది. అది మొదలు ఇంద్రజాలం లాగా కాశీ రాజ్యంలో జంతుబలులు లేవు!






మన నదులు :

# గంగ–1

నారదముని ఒకసారి భూలోకం నుంచి దేవలోకానికి బయలుదేరాడు. నిండు పున్నమి వెన్నెల కాంతుల్లో, హిమాలయ పర్వతాల మీదుగా, నారదుడు ఆనందంగా వీణవాయిస్తూ, హాయిగా పాడుకుంటూ నడవసాగాడు.

ఒక లోయ సమీపంలో అద్భుతమైన అందచందాలతో కొందరు స్త్రీ పురుషులు నారదుడికి కనిపించారు. "ఎవరై ఉంటారా?" అని ఆశ్చర్యపడుతూ ముని వాళ్ళను సమీపించాడు.





"ఎవరు మీరు?" అని అడుగుతూ వారిని మరి కొంత సమీపించినప్పుడు నారదుడు మరొక విషయం పసికట్టాడు. అక్కడివారిలో ప్రతి ఒక్కరికీ ఏదో ఒక అవయవ లోపం ఉన్నది. ఒకరికి ఒక కన్ను లేదంటే పక్కవారికి ఒక చెవి కనిపించడం లేదు. ఇంకొకరికి చేయి లేదంటే అవతలివారికి కాలు లేదు.







నారదుడి ప్రశ్నకు సమాధానం చెప్పడానికి మొదట జంకినా, ఆ తరవాత వాళ్ళు—తాము రాగాల, స్వరాల ఆత్మలైన గంధర్వులమని తెలియ చెప్పారు. గాయనీగాయకులు రాగాలను రాగయుక్తంగా ఆలాపించనప్పుడు, దాని దుష్ఫలితాలు తమకు దెబ్బల్లా తగులుతాయనీ, ఆ కారణం గానే ఇలా ఒక్కొక్క అవయవం పోగొట్టుకున్నామనీ తెలియజేశారు.

ఆ విషయం, సహజంగానే గాయకుడైన నారదుడికి ఇబ్బంది కల్గించింది. అతడు వారిని ఇంకా, విచారించినప్పుడు—పరిపూర్ణ గాయకుడైన పరమశివుడు పాడినట్టయితే, ఆ పాట వినడం ద్వారా, తాము పోగొట్టుకున్న అవయవాలను మళ్ళీ పొందగలమని తెలియజేశారు. నారదుడు వెంటనే కైలాసానికి వెళ్ళి శివుడికి విషయం మనవి చేశాడు.






అంతా విన్న పరమశివుడు పాడడానికి సమ్మతించాడు. అయితే, తన పాట వినడానికి కనీసం ఒక్కరైనా పరిపూర్ణ శ్రోత ఉండితీరాలని శివుడు షరతు పెట్టాడు. పైగా బ్రహ్మవిష్ణువు లిద్దరే పరిపూర్ణ శ్రోతలని కూడా శివుడు సూచించాడు. నారదుడు బ్రహ్మ దగ్గరికి వెళ్ళి శివుడి పాటను వినడానికి రమ్మని ప్రార్థించాడు.

శివుడి గానం వినడానికి బ్రహ్మ పరమసంతోషంతో అంగీకరించాడు. ఎందుకైనా మంచిదని, నారదుడు పరిపూర్ణ శ్రోతలిద్దరినీ తీసుకురావాలనుకున్నాడు. అతడు విష్ణువు దగ్గరికి వెళ్ళి విషయం చెప్పగానే, విష్ణువు అందుకు పరమానందంతో అంగీకరించాడు.





బ్రహ్మ విష్ణువులు, గంధర్వులూ శివుడి సముఖానికి వచ్చారు. శివుడు చాలాసేపు మౌనం వహించి, ధ్యాననిష్ఠలో గడిపి- ఆ పైన మెల్లగా పాడడం ప్రారంభించాడు. ఆ అద్భుతగానానికి అందరూ పరవశం చెందసాగారు.

శివుడి గానానికి ముగ్ధులై, గంధర్వులు నాట్యం చేయసాగారు. అప్పుడే వారి శరీరాలలో లోపించిన అవయవాలన్నీ సక్రమంగా పుట్టుకొచ్చాయి. అమితానందంతో వాళ్ళు శివుడికి కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించారు.





శివుడి గానంలోని సంగీత తరంగాలు చుట్టుపక్కల ప్రకృతిని అద్భుతమైన సౌందర్య సీమగా మార్చివేశాయి. చెట్టు చేమలు రంగు రంగుల పువ్వులతో కళకళలాడాయి. గాలి మలయ మారుతంలా వీచసాగింది. అక్కడి వాతావరణం భువికీ, దివికి నూతన శోభను ప్రసాదించింది.

అప్పుడు అక్కడ మరొక అద్భుతం కూడా జరిగింది. శివుడి మృదుమధుర గానాన్ని తన్మయత్వం చెంది వింటూన్న విష్ణువు శరీరంలోని ఒక పార కరిగి ప్రవహించసాగింది. ఆ వింతను ఒక్క బ్రహ్మ మాత్రమే పసిగట్టాడు.






బ్రహ్మ వెంటనే ఆ జలధారను తన కమండలంతో పట్టుకున్నాడు. ఆ జలధారే గంగానదికి మూలం. విష్ణు శరీరంలోని పార కరిగి ప్రవహించడం ద్వారా పుట్టడం వల్ల గంగానది ఎంతో పవిత్రమయిందిగా ఖ్యాతి గాంచింది!

# జ్ఞానోదయం

చిత్రపురి రాజు కీర్తిసేనుడికి, మరి కొంత కాలానికి తాను చనిపోక తప్పదనే దిగులు పట్టు కున్నది. ఇది గమనించిన మంత్రి ధర్మసేనుడు, ఆయనకు అరణ్యంలో తపస్సు చేసుకుంటున్న జ్ఞానానందుడనే ఋషిని దర్శించమని సలహా యిచ్చాడు.

కీర్తిసేనుడు, జ్ఞానానందుణ్ణి దర్శించి, తన దిగులు గురించి చెప్పుకుని, "నాకు చావు రాకుండా వుండే మార్గం సెలవీయగలరా?" అని అడిగాడు.

జ్ఞానానందుడు చిరునవ్వునవ్వి, "నీవిప్పుడు యవ్వనంలో వున్నావు. ఎల్లకాలమూ యిలాగే వుండగలనన్న భ్రమలో, నువ్వు చావంటే భయపడుతున్నావు. కాని, మరి కొన్ని ఏళ్ళు గడిచే సరికి నువ్వు వృద్ధుడివవుతావు. కంటిచూపూ, వినికిడిశక్తీ తగ్గుతుంది. పళ్ళు ఊడిపోతాయి. దేహబలం నశించి నడుం వంగిపోతుంది. ఇదంతా ప్రకృతి ధర్మం. ఆ దశలో, నీలో యింకా బతకాలనే ఆశ క్రమంగా తగ్గిపోతుంది. అందువల్ల, ఏదో ఒకనాడు రానున్న చావుగురించి దిగులుపడవలసిన అవసరం లేదు," అన్నాడు.

కీర్తిసేనుడు, జ్ఞానానందుడికి సమస్కరించి, "జ్ఞానోదయం కలగించారు, స్వామీ! నన్ను పట్టి పీడిస్తున్న దిగులు వదిలిపోయింది, సెలవు," అని చెప్పి రాజధానీనగరానికి తిరిగి వచ్చాడు.

—ఎన్. శివనాగేశ్వరరావు





# విద్యాధికారి

చంద్రచూడు డనే రాజు ఆస్థానంలో గౌరాంగుడు, గంభీరుడు అనే యిద్దరు కవులుండేవారు. గౌరాంగుడు ఎన్నో చక్కని కావ్యాలు రాసి, మహాకవిగా పేరు ప్రఖ్యాతులు గడించినవాడు. వయస్సులో ఎంతో చిన్నవాడైనా గంభీరుడు విద్వత్తు విషయంలో కడుదిట్ట. కావ్యరచనలో అతడప్పుడప్పుడే నలుగురిచేతా ప్రశంసింప బడుతున్నాడు.

సాహిత్యప్రియుడైన రాజు చంద్రచూడుడి దర్శనం కోసం ఎందరో పండితులూ, కవులూ వస్తూండేవారు. అలా వచ్చినవారిలో అర్హులైనవాళ్ళను ఉచిత రీతిని సత్కరించేందుకు తగిన సలహాలివ్వగల విద్వాంసుడు అవసరం అన్న అభిప్రాయం ఆయనకు కలిగింది.

చంద్రచూడుడు యీ సంగతి మంత్రి మిహిరశర్మకు చెప్పాడు. అందుకు మంత్రి కొంచెం ఆశ్చర్యం కనబరుస్తూ, "మహారాజా, గౌరాంగుడి వంటి మహాకవి మన ఆస్థానంలో వుండగా, మరెవరికోసమో అన్వేషించడం ఎందుకు? ఆయనను విద్యాధికారిగా నియమించండి. అవసర పడినప్పుడు మీకు తగిన సలహాలు యివ్వగలడు," అన్నాడు.

మంత్రి చెప్పినదానికి చంద్రచూడుడు అప్పటికి తలవూపి వూరుకున్నాడు. వారం రోజుల తరవాత లలాటదేశం నుంచి భూషణుడు అనే కవి ఆయనను చూడ వచ్చి, "ప్రభూ, నా తొలి కృతిని తమకు సమర్పించాలని ఎంతో దూరం నుంచి వచ్చాను," అన్నాడు.

చంద్రచూడుడు, భూషణుడు యిచ్చిన కావ్యాన్ని తీసుకుని, భటులను పిలిచి అతడికి తగిన వసతిసౌకర్యాలు ఏర్పాటు చెయ్యమని ఆదేశించాడు.

జొన్నలగడ్డ రత్న

తరవాత ఆయన గౌరాంగుడికి కబురు పంపి, భూషణుడు రాసిన కావ్యాన్ని అతడికిచ్చి, "చదివి మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి." అన్నాడు.

మర్నాడు గౌరాంగుడు రాజు వద్దకు వచ్చి, "మహారాజా, కావ్యాన్ని సాంతం చదివాను. ఈ కవికి యిది తొలి ప్రయత్నమే అయినా, ఎంత వెతికినా మచ్చుకు ఒక్క తప్పయినా కానరావడం లేదు," అని చెప్పాడు.

గౌరాంగుడు వెళ్ళిపోయాక చంద్రచూడుడు, గంభీరుడికి కబురు పంపాడు. అతడు రాగానే, భూషణుడి కావ్యాన్ని అతడికిస్తూ, "రచన ఎలా వున్నదో చదివి చెప్పండి." అన్నాడు.

రెండు రోజుల తర్వాత గంభీరుడు రాజు దగ్గిరకు వచ్చి, "మహారాజా, కవి కావ్యరచన కొత్తగా చేపట్టినవాడిలా కనబడుతున్నాడు. అయినా, రచనలో మెచ్చదగిన ఒకటి, రెండు రసవత్తర ఘట్టాలు లేకపోలేదు," అంటూ తన అభిప్రాయం వెల్లడించాడు.

గంభీరుడు సెలవుపుచ్చుకుని వెళ్ళాక చంద్రచూడుడు పక్కనే వున్న మంత్రితో, "విద్యాధికారిగా నాకు తగు సలహాలిచ్చేందుకు గంభీరుణ్ణి నియమిస్తున్నాను. అందుకు అవసరం అయిన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

మంత్రి మిహిరశర్మ ఎక్కడలేని ఆశ్చర్యంతో, "ఇంత ముఖ్యమైన పదవిని



అతి పిన్నవయస్కుడైన గంభీరుడికి యివ్వడమా! ఈ సంగతి విని మహాకవిగా పేరు పొందిన గౌరాంగుడు బాధపడే అవకాశం వున్నది. అయినా, మహారాజులు యిలా నిర్ణయించడానికి తప్పకుండా ఏదో ముఖ్య కారణం వుండి వుంటుంది,'' అన్నాడు.

చంద్రచూడుడు ఒక క్షణం ఆగి, ''భూషణుడి కావ్యం చదివి గౌరాంగుడూ, గంభీరుడూ ఏమి చెప్పారో, ఆ సమయంలో నా పక్కనే వున్న మీరు విన్నారుగదా ?'' అని అడిగాడు.

అవునన్నట్టు మంత్రి తలవూపాడు.

''ఈ కవులిద్దరూ భూషణుడి కావ్యాన్ని పరిశీలించిన పద్ధతి చూసిన తరవాతే, నాకు గంభీరుడు విద్యాధికారిగా తగినవాడనిపించింది. ఆస్థానానికి వచ్చే కవులను ఆదరించి తగిన పారితోషికం యిచ్చి పంపడానికి, విద్యాధికారిలో కొంత పాండిత్యంతోపాటు రసజ్ఞత అవసరం. అంతే కాని, ఆ వచ్చిన కవిలోని దోషాల్ని వెతికిపట్టుకోవడం కాదు. అవునా ?'' అన్నాడు చంద్రచూడుడు.

మంత్రి అవునన్నట్టు తల వూపాడు.

''మనం విద్యాధికారి పదవిని గౌరాంగుడికి కట్టబెడితే జరగబోయేదేమిటో వినండి. ఆయన రాజాశ్రయం కోరివచ్చిన కవిపండితులలోని తప్పులనే వెదకడానికి ప్రయత్నిస్తాడు. అదే గంభీరుడైతే, వారిలో మెచ్చదగిన పాండిత్య, కవిత్వాంశాలేమైనా వున్నవా అని చూస్తాడు. ఈ పదవిని ఏర్పాటు చేసిన ప్రయోజనం నలుగురూ పొందాలంటే, గంభీరుడే అందుకు తగినవాడు,'' అన్నాడు చంద్రచూడుడు.

రాజు చెప్పినది విన్నాక, మంత్రికి ఆయన నిర్ణయం ఎంతో సమంజసమైనదిగా తోచింది.

గంభీరుడు విద్యాధికారిగా నియమించబడ్డాడు. అతడు ఆ పదవిలో వుంటూ ఎందరో కవిపండితులకు రాజాదరణ లభించేట్టుచేసి, ఉదారుడూ, వివేకీ అని అందరిచేతా ప్రశంసించబడ్డాడు.





# గోవిందుడి సోద

వేమవరం అన్న గ్రామంలో, నాగేంద్రయ్య, వరలక్ష్మి అనే దంపతులుండేవాళ్ళు. వాళ్ళు గ్రామంలోని ఆస్తిపరుల్లో ఒకరు. వాళ్ళకు గోవిందుడు అనే వాడొక్కడే కొడుకు. వాడు చదువుసంధ్యలూ, తెలివి తేటలూ వున్నవాడే గాని, ఇంటి పను లేమాత్రం పట్టించుకోకుండా, అన్నివేళలా స్నేహితులతో తిరుగుతూండేవాడు. తల్లి దండ్రులు ఎంత కోప్పడినా లెక్కచేసే వాడు కాదు.

ఇలా వుండగా గోవిందుడి మేనమామ ఒకసారి తన చెల్లెలిని చూడడానికి వచ్చి, మేనల్లుడి పరిస్థితి తెలుసుకుని, వాడలా చెడిపోవడానికి మీరే కారణమంటూ, బావా చెల్లెళ్ళ మీద దెబ్బలాటకుదిగాడు.

''మేమేం చేయగలం? ఎంత చెప్పినా, ఎన్ని తిట్టినా వాడు లెక్కచేయడం లేదు,'' అన్నారు వాళ్ళు.

గోవిందుడి మేనమామ, వాణ్ణి పిలిచి, ''ఒరే, నీ తల్లిదండ్రులు నిన్ను ఎదురుగా తిడుతున్నారు; స్నేహితులు చాటుగా తిడుతున్నారు. చేతకానివాణ్ణి ఎవ్వరూ గౌరవించరు,'' అన్నాడు.

''నా స్నేహితులు అలాంటివాళ్ళు కాదు,'' అన్నాడు గోవిందుడు.

''నీ స్నేహితుల నిజరూపం తెలుసుకో వాలంటే, ఒక ఉపాయం వున్నది. నీ గొప్పతనాన్నీ, సామర్థ్యాన్నీ వాళ్ళ దగ్గిర విపరీతంగా పొగుడుకో, అప్పుడు వాళ్ళేం చేస్తారో చూడు!'' అన్నాడు మేనమామ.

గోవిందుడు అలాగే చేశాడు. మొదట్లో వాడి స్నేహితులు ఏదో సరదాకు చెపుతు న్నాడని విన్నారు. కాని, వాడు నిజంగానే యీ గొప్పలన్నీ చెబుతున్నాడని గ్రహిం చాక, ''ఏరా, తల్లి పుట్టింటి సంగతి మేనమామకు తెలియదా? నీ గొప్ప



వాడికి గ్రామంలో స్నేహితుడంటూ లేకుండా పోయాడు.

అప్పుడు గోవిందుడు మేనమామ దగ్గిరకుపోయి, ''నువ్వు చెప్పింది అక్షరాలా నిజం! నా స్నేహితులు అసూయాపరులు. నా గొప్పతనం విని ఓర్చలేక పోతున్నారు. ఇంతకాలంగా వాళ్ళతో తిరిగి, నా కాలాన్ని వృథా చేసుకున్నాను. ఇప్పుడేం చేయాలో నువ్వే చెప్పు,'' అని అడిగాడు.

''నీ తల్లిదండ్రుల మాట విని, వాళ్ళు చెప్పినట్టు చేస్తూ, వాళ్ళను సంతోష పెట్టు,'' అన్నాడు వాడి మేనమామ.

''వాళ్ళు మాత్రం, నా స్నేహితుల్లాంటి వాళ్ళు కాదన్న నమ్మకమేమిటి?'' అన్నాడు గోవిందుడు అనుమానంగా.

''నీ గురించి ఎన్ని పొగడ్తలు చెప్పుకున్నా వాళ్లు వింటారు. అంతేగాని అసూయపడరు,'' అన్నాడు మేనమామ.

తరవాత ఆయన తన చెల్లెలికీ, బావగారికీ వాడు తనను తానెంతగా పొగడుకున్నా విని, అవుననమని సలహా యిచ్చాడు. కొడుకు బాగుపడితే అదే చాలుననుకుని, వాళ్ళు సరేనన్నారు.

ఆ రోజు నుంచీ గోవిందుడు తల్లిదండ్రుల దగ్గిరే తన గొప్పలు చెప్పుకోసాగాడు. వాళ్ళు ఎంతో ఓపికగానూ,

తనమేపాటిదో, మాకు తెలును!'' అని విసుక్కున్నారు.

అయినా గోవిందుడు తన అలవాటు మానకుండా, ''మా ఇంట్లో నా మాటకు ఎలాంటి విలువ యిస్తారో, మీకు తెలియదు. వ్యవసాయప్పనుల నుంచి ఎన్నో విషయాల్లో, అంతా నా సలహా ప్రకారమే, మా నాన్న చేస్తూంటాడు. కావాలంటే మా నాన్న నడగండి, అమ్మ నడగండి, మా మేనమామ నడగండి,'' అన్నాడు.

తనను గురించిన లేనిపోని గొప్పలు చెప్పుకోవడం గోవిందుడు మానడని తెలుసుకుని, వాడి స్నేహితులు క్రమంగా దూరం కాసాగారు. ఒక నెల గడిచేసరికి

అభిమానంగానూ వినడం గమనించి, వాడికి వాళ్ళంటే చాలా ప్రేమాభిమానాలూ, గౌరవం కలిగి, వాళ్ళు చెప్పినట్టు ఇంటి పనుల్లో, వ్యవసాయపనుల్లో సాయపడసాగాడు.

మేనల్లుడిలో వచ్చిన మార్పు, మేనమామకు సంతోషం కలిగించింది. ఆయన తిరిగి తన ఊరు వెళ్ళేప్పుడు వాడితో, "ఒరే, ఎప్పుడూ ఒకేలాగు పొగుడుకుంటే, అయినవాళ్ళకూ్కడా విసుగు పుడుతుంది. ఒక పని చెయ్యి. ఈ రోజు నుంచీ గొప్ప గొప్ప కావ్యాలూ, కథలూ చదవడం ప్రారంభించు. వాటిల్లో మంత్రులు రాజుల్నీ, భక్తులు దేవుణ్ణీ, భార్యలు భర్తల్నీ ఎన్నో విధాల పొగిడిన విపరాలుంటవి. ఆ పొగడ్తలన్నీ, నీ సొంతం చేసుకో!" అన్నాడు.

గోవిందుడు, మేనమామ సలహా ప్రకారం కథలూ, కావ్యాలూ చదవడం ప్రారంభించాడు. కొడుకులో వచ్చిన మార్పు నాగేంద్రయ్య, వరలక్ష్మిలకు సంతోషం కలిగిస్తున్న మాట నిజం. కాని, వాడిప్పుడు తనను తాను పొగుడుకోవడంతోపాటు, తల్లిదండ్రులను కూడా అర్థం లేని పొగడ్తలతో విసుగెత్తించసాగాడు. దీన్ని భరించలేక వాళ్ళు, వాణ్ణి కాస్త బయిటికిపోయి తిరిగి రమ్మనేవాళ్ళు.



అయితే, గ్రామంలో అందరికీ వాడి సంగతి తెలిసిపోవడంతో, వాళ్లు వాణ్ణి తప్పించుకు తిరగసాగారు.

ఆఖరికి ఒక రోజున గోవిందుడి తల్లి, భర్తతో, "మనవాడి పొగడ్తల సొద భరించడం చాలా కష్టంగా వున్నది. దీనికేదైనా ఉపాయం చూడండి," అన్నది.

"ఇందుకు వేరే ఉపాయం ఏమీ లేదు. వాడికి పెళ్ళి చేసేస్తే, ఆ సొదంతా వాడి భార్య భరిస్తుంది!" అన్నాడు నాగేంద్రయ్య.

వాళ్ళు, గోవిందుడి పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించారు. అయితే, వాడికి అప్పటికే అతి వాగుడుగాడూ, సొదమనిషీ అని



వాడి తల్లిదండ్రులు మేనమామతో, "అందరూ వాడికి పిల్లనివ్వడానికి వెనకాడుతున్నప్పుడు, నువ్వు మాత్రం ఒప్పుకుంటావా అని పూరుకున్నాం. నీకు యిష్టమైతే, మాకూ యిష్టమే!" అన్నారు.

గోవిందుడికీ, రాధకూ వివాహమైంది. ఇప్పుడు వాడు తన పొగడ్తల సొదంతా భార్యకు చెప్పుకోవడం ప్రారంభించాడు. ఇందువల్ల వాడి తల్లిదండ్రులకు ప్రాణం సుఖంగా వుంటున్నది. అందుకు కారణం అయిన కోడలంటే, వాళ్ళకు ఎంతో ప్రేమాభిమానాలు కలిగినై.

రాధకు అత్తవారింట సుఖంగానే వున్నది కానీ, భర్త సొద భరించడం కష్టమైపోయింది. ఆమె బాగా ఆలోచించి, రోజూ ఏవో పూజలూ, వ్రతాలూ, నోములూ చేయసాగింది. ఆమె యిలాంటి పనుల్లో వుండగా, గోవిందుడు తన సొద ఆమెకు వినిపించేవాడు కాదు. ఆ బాధ తప్పడంతో క్రమంగా రాధలో దైవభక్తి పెరిగిపోయింది. ఆమె నాస్తికత్వం వదిలి ఆస్తికురాలు కావడంతో, అత్తమామలు చాలా సంతోషించి, యీ సంగతి వియ్యంకుడికి తెలియజేశారు.

గోవిందుడి మేనమామ, తన కూతురిలో యింత మార్పు ఎలా కలిగిందా అని ఆశ్చర్యపోయి, ఆమెను చూడవచ్చాడు.

పేరు పడిపోవడంతో, వెంటనే పిల్లనిచ్చేందుకు ఎవరూ ముందుకు రాలేదు.

ఆ సమయంలో గోవిందుడి మామ, వాళ్ళ ఇంటికి వచ్చి సంగతి తెలుసుకుని, "ఉయ్యాల్లో పిల్లవాణ్ణి పెట్టుకుని ఊరంతా వెతికినట్టు, నా కూతురు రాధ ఉండగా, వాడికి వేరే సంబంధాలు చూస్తారెందుకు?" అని అడిగాడు.

గోవిందుడి తల్లిదండ్రులు ముఖముఖాలు చూసుకున్నారు. రాధ గోవిందుడికి ఈడైనదని వాళ్ళకు తెలుసు. అయితే, ఆ పిల్ల పరమ నాస్తికురాలు. బొత్తిగా దైవభక్తిలేదు. పూజలూ, వ్రతాలూ అంటే అసలు గిట్టదు.

రాధ తండ్రికి అసలు కారణం వివరించి చెప్పింది. ఒక నాస్తికురాలిని, ఆస్తికురాలుగా చేయగలిగిన గోవిందుడి సొద అద్భుతం అనిపించిందాయనకు. కాని, కూతురుకు భర్తపట్ల వుండవలసినంత ఆదరం లేదు. అతడంటే ఆమెకు భయంగా వుంటున్నది.

గోవిందుణ్ణి ఎలాగైనా మార్చాలనుకుని ఆయన గోవిందుణ్ణి ఊరిబయటకు షికారు తీసుకుపోయి, "ఒరే, నిన్ను పనికి మాలిన స్నేహితుల నుంచి దూరం చేసేందుకు, సొంత పొగడ్తల సొదె ప్రారంభించమన్నాను. అది, యిప్పుడు నీలో బాగా ముదిరిపోయి, అయినవాళ్ళు కూడా నువ్వంటే భయపడుతున్నారు. నువ్వింక, యీ దురలవాటు మానుకోవాలి," అన్నాడు.

"నాకిప్పుడు వాగుడు బాగా అలవాటైపోయింది, మామయ్యా! అది తగ్గే ఉపాయం ఏదో నువ్వే చెప్పు." అన్నాడు గోవిందుడు.

మేనమామ కాసేపాలోచించి, "అయితే, నేను చెప్పినట్టు చెయ్యి. ఇప్పటి నుంచీ ఎదుటివాళ్ళతో మాట్లాడేటప్పుడు, నిన్ను పొగుడుకోవడం మానేసి, వాళ్లను పొగుడుతూండు. తరవాత ఏం జరుగుతుందో చూడు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

మేనమామ చెప్పినట్టే, ఈ కొత్త పద్ధతి ప్రారంభించాడు గోవిందుడు. క్రమంగా వాడికి స్నేహితులు పెరిగారు. ఇంట్లో వాళ్ళు కూడా వాడి మాటలు వినడానికి యిష్టపడసాగారు. కాని, ఇంతకాలం తనను పొగడుకునేందుకు అలవాటుపడ్డ గోవిందుడికి, యితరులను పొగడడం విసుగ్గా వుంటున్నది. అందువల్ల క్రమంగా వాడి సొద తగ్గిపోయింది. ఊరికే వుంటే, ఏదో మాట్లాడక తప్పదని, వాడు ఇంటి పనుల్లో, మునిగి తేలసాగాడు.

ఇలా కొంతకాలం గడిచేసరికి, గోవిందుడు మంచి పనిమంతుడని పేరు తెచ్చుకున్నాడు. అయినవాళ్ళూ, స్నేహితులూ కూడా వాణ్ణి ఎంతో అభిమానించసాగారు.






# అనుకూలవతి అయిన భార్య

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆయన భార్యకు తన భర్తపైన ఎంతో గురి. ఆయన ఏమి చేసినా ఆమెకు గొప్పగానే ఉండేది. వారికి తగినంత పొలం ఉన్నది, రెండు ఆవులున్నాయి. అందుచేత వారు పాడిపంటలకు లోటు లేకుండా సుఖంగా కాపరం చేస్తున్నారు. రైతు భార్య వందరూపాయలు కూడబెట్టింది కూడాను.

ఆమె ఒకనాడు తన భర్తతో, "మనకు ఒక ఆవు పాడి సరిపోతుంది. గొడ్డుకు గొడ్డంత చాకిరీ చెయ్యాలిగద. అందుచేత ఒక ఆవును తీసుకుపోయి అమ్ముకు రండి. నిలవ ఉంచిన నూరు రూపాయలూ అంటుకోకుండా పండగలకూ, పబ్బాలకూ ఖర్చు చేసుకునేటందుకు డబ్బు చేతిలో ఆడుతుంది" అన్నది.

రైతు సరేనని ఒకనాడు తన ఆవులలో ఒకదాన్ని వెంట తీసుకుని బస్తీకి వెళ్లాడు. అయినా ఆవు అమ్ముడుపోలేదు. "అమ్మక పోతే మునిగిందేమిటి? మన సొత్తు మనకే ఉంటుంది!" అనుకుని రైతు ఆవును తీసుకుని ఇంటిదారి పట్టాడు.

దారిలో ఆయనకు ఒక మనిషి గుర్రాన్ని తెస్తూ ఎదురైనాడు. రైతు ఆ మనిషికి తన ఆవునిచ్చి గుర్రాన్ని తీసుకుని ముందుకు సాగాడు.

కొంత దూరం వెళ్ళేసరికి ఆయనకు ఒక మనిషి మేకను తోలుకుంటూ ఎదురు వచ్చాడు. రైతు ఆ మనిషికి గుర్రాన్నిచ్చి మేకను తీసుకున్నాడు.

ఇంకా కొంత దూరం వెళ్ళేసరికి రైతుకు ఒక మనిషి ఒక బాతుతో ఎదురు పడ్డాడు. రైతు ఆ మనిషికి మేకనిచ్చి బాతును తీసుకున్నాడు.

మరి కొంత దూరం వెళ్ళేసరికి ఒక మనిషి కోడిపుంజుతో ఎదురుపడ్డాడు.

రైతు తన దగ్గిర వున్న బాతును కోడి పుంజుతో మారకం వేశాడు.

రైతు వెళ్ళవలసిన దూరం చాలా ఉన్నది. ఆయనకు ఆకలి దహించుకు పోతున్నది. అందుచేత ఆయన దారిలో ఒక ఇంటివాళ్ళకు ఆ కోడిపుంజు నిచ్చి కడుపునిండా అన్నం తిని వట్టి చేతులతో తన గ్రామానికి చేరుకున్నాడు.

రైతుకు పొరుగింటివా డొకడు కని పెంచి, "బస్తీకి వెళ్ళావుట, మంచి బేరం చేసుకొచ్చావా ?" అని అడిగాడు.

రైతు పొరుగింటివాడితో జరిగినదంతా చెప్పి, "నేను చేసింది పొరపాటంటావా?" అని అడిగాడు.

"పొరపాటా, పొరపాటున్నరా ? నువు చేసిన పని చూసి మీ ఆవిడ ఎంత పోట్లాట పోట్లాడుతుందో చూడు !" అన్నాడు పొరుగింటివాడు.

"మా ఆవిడ పోట్లాడే రకం కాదులే!" అన్నాడు రైతు.

"ఎంత అమాయకురాలైనా, ఇవాళ నువు చేసిన పనికి తప్పక ఇంటికప్పు ఎగరగొట్టేస్తుంది !" అన్నాడు పొరుగింటి వాడు.

ఇద్దరూ పందాలు ఒడ్డుకున్నారు.

"నా దగ్గిర నూరు రూపాయలు నిలవ ఉన్నాయి. మా ఆవిడ నన్ను తప్పు పట్ట



దని ఆ నూరు రూపాయలూ ఒడ్డుతాను. నువో ?" అని రైతు అడిగాడు.

"నీతో పోట్లాడుతుందని నేనూ నూరు రూపాయలు ఒడ్డుతాను," అన్నాడు పొరుగింటివాడు.

"అయితే నువు నా వెంట వచ్చి బయటి అరుగు మీద కూచుని మా సంభాషణ ఆలకించు !" అంటూ రైతు పొరుగింటివాణ్ణి వెంటబెట్టుకునిపోయి తమ వీధి అరుగు మీద కూచోబెట్టి తాను మాత్రం లోపలికి వెళ్ళాడు.

"ఏమండీ, వచ్చారా ? ఆవు అమ్ముడయిందా ? ఎంత ధరకు అమ్మారేమిటి?" అన్నది రైతు భార్య.

''ఎవరూ కొనలేదు. అందుకని దాన్ని ఇచ్చి ఒక గుర్రాన్ని తీసుకున్నాను,'' అన్నాడు రైతు.

''మంచిపని చేశారు. ఒక బండీ కొన్నామంటే మనం ఎక్కడికైనా సుఖంగా వెళ్ళవచ్చు!'' అన్నది భార్య.

''గుర్రాన్ని తేలేదు. దాన్ని మార్చి ఒక మంచి మేకను తీసుకున్నాను,'' అన్నాడు రైతు.

''అదే మంచిది. గుర్రాన్ని మేపలేం, బాబూ. మేకను కానీ ఖర్చు లేకుండా హాయిగా మేపవచ్చు. ఏదీ మేకా?'' అన్నది భార్య.

''కొంచెం ఆగు, మేకను మార్చి బాతును తీసుకున్నాను,'' అన్నాడు రైతు.

''భేషైన పని చేశారు. మేక వెంట తిరగలేకచావాలి,'' అన్నది భార్య.

''ఆ బాతును మార్చి కోడిపుంజు తీసుకున్నాను,'' అన్నాడు రైతు.

''కోడిపుంజయితే ఇంకా బాగుండేదే అని అందామనుకుంటున్నాను. పుంజే నయం, చక్కగా పొద్దున్నే మనల్ని నిద్ర లేపుతుంది,'' అన్నది రైతు భార్య ఎంతో సంతోషంతో.

''అయితే ఏం జరిగిందంటే, దారిలో ఆకలి మండిపోయింది. అందుకని ఆ పుంజును ఒకళ్ళ కిచ్చి వారింట ఇంత భోజనం చేసి చక్కా వచ్చాను,'' అన్నాడు రైతు.

''మంచి పని చేశారు! వెధవ పుంజు, ప్రాణంకంటె ఎక్కువా ఏమిటి?'' అన్నది రైతు భార్య.

రైతు బయటికి వచ్చి, తనతో పందెం వేసిన పొరుగింటి వాడితో. ''విన్నావుగా మా సంభాషణ?'' అన్నాడు.

''విన్నాను, విన్నాను! మా ఇంటికి వచ్చి నువు గెలుచుకున్న నూరు రూపాయలూ పట్టుకు పో!'' అన్నాడు పొరుగింటివాడు అరుగు మీది నుంచి కిందికి దిగుతూ.

భార్య అనుకూలవతి కావడం చేత రైతు ఈ విధంగా ఆవు ఖరీదుకు రెట్టింపు సంపాదించుకున్నాడు.






కుమార్తె వివాహం గురించి సంశయావస్థలో వున్న అనరణ్యుడికి మంత్రులు యిలా సలహా యిచ్చారు:

"మహారాజా, పద్మావతి వంటి స్త్రీ ఈ మహాముని వంటి భర్తను పెళ్ళాడ గోర వచ్చును. ఈయన గొప్ప వంశాన పుట్టినవాడు, కులశ్రేష్ఠుడు. అలాటివాడికి కన్యను ఇవ్వటం గొప్ప విషయమే. ఈయనను పద్మావతికి చూపి ఆమె వివాహానికి అంగీకరించే పక్షంలో ఇద్దరికీ వివాహం చేసెయ్యి. ఆమె అంగీకరించని పక్షంలో ఈ మునీశ్వరుడు వెళ్ళిపోతాడు."

అనరణ్యుడికి పెద్ద బెడద తీరింది. పిప్పలాదుణ్ణి చూసి పద్మావతి అయనకు భార్య కావటానికి సమ్మతించింది. అనరణ్యుడు వారిద్దరికీ పెళ్ళి చేసి గొప్ప కీర్తి సంపాదించుకున్నాడు.

వివాహం కాగానే పిప్పలాదుడు పద్మావతిని తన వెంట ఋషిపల్లెకు తీసుకుపోయాడు. కుమార్తెపై గల ప్రేమ చేత అనరణ్యుడు కూడా, తన రాజ్యాన్ని పెద్దకొడుకు పరం చేసి, అయిదుగురు భార్యలనూ వెంటబెట్టుకుని, కుమార్తె ఉన్న చోటికే వానప్రస్థం వెళ్ళాడు.

ఒకనాడు పద్మావతి నదిలో స్నానం చెయ్యటానికి వెళ్ళేసరికి, ధర్మదేవత నవమన్మథుడైన యువకుడి రూపంలో ఆమె వద్దకు వెళ్ళి, "సుందరీ, నీ అందానికి తగినవాణ్ణి నేను. ఆ ముసలి భర్తతో కాపరం చేస్తూ నీ యౌవనాన్ని అడవి



గాసిన వెన్నెల చేయక, నా వెంట నా రాజ్యానికి వచ్చి, మహారాణి లాగ జీవించు,'' అన్నాడు.

పద్మావతి ఆగ్రహావేశంతో, ''నా భర్తను నిందించిన నువు క్షయమైపోవుదువుగాక!'' అని శపించింది.

ధర్మదేవత అదిరిపడి, ''అమ్మా, నేను రాజును కాను, ధర్మదేవతను! నీ పాతివ్రత్యం పరీక్షించ వచ్చాను. నన్ను మన్నించి, శాపం ఉపసంహరించు,'' అని వేడుకున్నాడు.

పద్మావతి కూడా తెలియక చేసిన తప్పుకు నొచ్చుకుని, ''శాపం ఉపసంహరించడం నాకు సాధ్యం కాదు. ఒక్కొక్క యుగంలో, ఒక్కొక్క పాదాన్ని పోగొట్టు కుంటూ సంచరించు,'' అన్నది.

వసిష్ఠుడు పద్మావతి కథ చెప్పి, 'మేనకా హిమవంతులారా, మీరు కూడా అనరణ్యుడు చేసినట్టే, మీ కుమార్తెను శివుడి కిచ్చి పెళ్ళి చెయ్యండి,'' అన్నాడు.

మేనకా హిమవంతులు తృప్తిపడ్డారు. మైనాకుడు మొదలైన బంధువులు కూడా శివ పార్వతుల వివాహానికి సుముఖులయారు.

అప్పుడు మేనకా హిమవంతులు పార్వతి చేతిని అరుంధతీ వసిష్ఠుల చేతిలో పెట్టి, ''మీ యిష్టప్రకారమే ఈ పిల్లను శివుడి కిచ్చి వివాహం చేద్దాం. పెళ్ళికి ముహూర్తం నిశ్చయించండి,'' అన్నారు.

అరుంధతి పార్వతిని లోకమాత కమ్మని ఆశీర్వదించింది. మాఘ శుద్ధ ఏకాదశి నాడు ఆరుద్రనక్షత్ర మందు వృశ్చిక లగ్నం ముహూర్తం పెట్టి, ఆ రోజు తెల్లవారుఝామున శివ పార్వతుల పెళ్ళి జరపటానికి నిశ్చయం జరిగింది.

సప్తమహర్షులు శివుడి వద్దకు తిరిగి వచ్చి, పని సానుకూలమయిందని తెలిపారు. వారు పెళ్ళి పనులు చేయటానికి బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులను నియోగించమని సలహా ఇచ్చి వెళ్ళిపోయారు.

పార్వతి వివాహానికి కావలసిన ఏర్పాట్లన్నీ సక్రమంగా జరిగాయి. సంబారాలన్నీ సమకూర్చారు. హిమవంతుడు తన మంత్రులచేత పనులన్నీ చేయించాడు. శుభలేఖలు బంధువు లందరికీ వెళ్ళాయి. పార్వతిని పెళ్ళికూతుర్ని చేయటానికి పట్టణంలో గల ముత్తయిదువు లందరూ వచ్చారు.

మంచి ముహూర్తం చూసి పార్వతికి మంగళస్నానం చేయించి, సాంబ్రాణి ధూపం వేసి, పట్టుబట్టలు కట్టబెట్టి, అలంకారాలు పెట్టి, ఆమెకు పునుగూ, జవ్వాదీ, హరిచందనమూ పూసి, నుదుట కస్తూరి బొట్టు పెట్టి, పుష్పహారాలు వేసి, పెళ్ళి కూతుర్ని చేసి ఉత్సవం జరిపారు.



పార్వతీ కల్యాణం సందర్భంలో హిమవంతుడు పంపిన ఆహ్వానం అందుకుని ఆయన బంధువులూ, మిత్రులూ సకుటుంబంగానూ, సపరివారంగానూ రావటం మొదలుపెట్టారు. వారు తమ వెంట బంగారు తామరపుష్పాలూ, ముత్యాలూ, మాణిక్యాలూ, పగడాలూ మొదలైన కానుకలు తెచ్చారు. వేరు వేరు పర్వతాల రాజులు నవరత్నాలనూ, చందనం మొదలుగాగల సుగంధ ద్రవ్యాలనూ, మదించిన ఏనుగులనూ, సైంధవాశ్వాలనూ కానుకలుగా తెచ్చారు. హిమవంతుడా కానుకలను స్వీకరించి, అతిథులకు గౌరవ మర్యాదలు చేశాడు, వారికి విడుదులు ఏర్పాటు చేశాడు.

వచ్చేవారికి విడుదులు తయారు చెయ్యటానికీ, పదివేల యోజనాల నిడివి గల కల్యాణ మంటపం నిర్మించటానికీ హిమవంతుడు విశ్వకర్మ సహాయం పొందాడు. హిమవంతు డుండే ఓషధీపురాన్ని అద్భుతంగా అలంకరించారు.

కైలాసంలో శివుడు, హిమవంతుడు పంపిన లగ్నపత్రిక అందుకుని సంతోషించి, వాయుదేవుణ్ణి పంపి నారదుణ్ణి పిలిపించాడు. నారదుడు వచ్చి, తనను పిలిపించిన కారణం అడిగాడు.



''నారదా, ఇంకా అయిదు రోజులలో నాకూ, హిమవంతుడి కూతురైన పార్వతికీ వివాహం జరగనున్నది. వ్యవధి అట్టే లేదు. నువు కామగమనం గల వాడివి గనక, మూడు లోకాలవారినీ వివాహానికి ఆహ్వానించి రావాలి. కుబేరుడు మొదలైన వారితో పెళ్ళికి కావలసినే సరంజామా అంతా తీసుకురమ్మని చెప్పాలి,'' అని శివుడు నారదుడితో అన్నాడు.

నారదుడు అందుకు సంతోషంగా ఒప్పుకుని, శివుడి వద్ద సెలవు పుచ్చుకుని, బ్రహ్మవిష్ణు దేవేంద్రాది దేవతలతోనూ, భూలోకంలోనూ, నాగలోకంలోనూ వుండే వారితోనూ, ''మాఘ శుద్ధ ఏకాదశి నాటి రాత్రి తెల్లవారుఝామున శివపార్వతులకు వివాహం జరుగుతున్నది. మీరందరూ రావాలి,'' అని చెప్పాడు. తరవాత ఆయన కుబేరుణ్ణి వెంట బెట్టుకుని, వివాహానికి కావలిసిన వస్తువు లన్నిటితోనూ కైలాసానికి తిరిగి వచ్చాడు.

శివపార్వతుల వివాహం చూడటానికి శివుడి ఆహ్వానం పొందిన బ్రహ్మవిష్ణువులూ, దేవేంద్రుడూ, ఇతర దేవతలూ, మహర్షులూ కైలాసానికి రాసాగారు. నందీశ్వరుడూ, రుద్రగణాల వాళ్ళూ అతిథులను గౌరవించి, వారికి తగిన ఇళ్ళూ, వసతులూ ఏర్పాటు చేశారు.

శివుడి పెళ్ళికి బ్రహ్మ పురోహితుడుగానూ, విష్ణువు బావమరిదిగానూ, ఇంద్రాది దేవతలూ, ఋషులూ సదస్యులుగానూ ఉండేటట్టు నిర్ణయమయింది. శివుడికి మంగళాభిషేకం చెయ్యటానికి బృహస్పతి ముహూర్తం నిర్ణయించాడు. ఆ ముహూర్తాన, గరుడ గంధర్వ యక్షస్త్రీలూ, సప్తమాతృకలూ, లక్ష్మి, సరస్వతీ, శచీ, అరుంధతీ లాటి మహా పతివ్రతలూ శివుడిచేత స్నానం చేయించి, హరిచందనం లాటి పూతలు పూసి, కంఠహారాలు వేసి పెళ్ళికొడుకును చేశారు. గౌతముడూ, అత్రీ, భృగువూ మొదలైన మహర్షులు శివుడి కుడిచేతికి శాస్త్రోక్తంగా దీక్షాబంధం



కట్టి, భక్తితో నవగ్రహ పూజలు జరిపించారు. తరవాత బ్రహ్మ ఆజ్ఞాపించగా, శివుడు తన పక్షం వారి నందరినీ కలుపుకుని, మంగళ వాద్యాలతోనూ, నృత్యాలతోనూ ఓషధీపురానికి బయలుదేరాడు. కైలాసానికి రక్షకులుగా రుద్రగణాల నాయకులను ఉంచి, నందీశ్వరుడు ప్రమథగణాల నన్నిటినీ పెళ్ళికి తరలించుకు వచ్చాడు. వీరభద్రుడూ, చండీశ్వరుడూ, భైరవుడూ, నందీశ్వరుడూ తమ తమ వాహనాల మీద బయలుదేరారు.

పెళ్ళి కొడుకైన శివుణ్ణి ఐరావతం మీద కూర్చోబెట్టారు. సరస్వతీ బ్రహ్మలు హంస మీదా, లక్ష్మి విష్ణువులు గరుడుడి మీదా, శచీ ఇంద్రులు కదిలే సింహాసనం మీదా ప్రయాణం చేశారు. కుబేరుడు నవ నిధులతో శివుడి వెనక కూర్చున్నాడు. దేవతాస్త్రీలూ, ఋషిపత్నులూ, అప్సరసలూ దివ్యవస్త్రాలనూ, సుగంధ ద్రవ్యాలనూ తీసుకుని విమానాలలో బయలుదేరారు.

పెళ్ళివారు నగరం సమీపిస్తూ ఉండగా హిమవంతుడు తన పురోహితుడైన గర్గ మహామునినీ, మేనకనూ, కొడుకులనూ వెంట బెట్టుకుని, మేళతాళాలతో ఎదురు వచ్చి, బ్రహ్మ విష్ణు దేవేంద్రులకూ, ఋషులకూ నమస్కారం చేసి, శివుడి ముందు చేతులు మోడ్చి నిలబడి, "సర్వేశ్వరుడవైన నీవల్ల నేను గొప్పవాణ్ణి అయాను. పెళ్ళికొడుకువై నా యింటికి వచ్చిన నీకు నా కుమార్తె నిచ్చి వివాహం చేస్తాను. నువు ఆమెను వివాహమాడి నన్నూ, నా వంశాన్నీ పవిత్రం చెయ్యవలసిందని ప్రార్థించుతున్నాను," అన్నాడు. ఆయన శివుడికి బట్టలూ, గంధ పుష్ప తాంబూలాలూ ఇచ్చి, అందరికీ పాలూ, పానకాలూ ఇచ్చి, శ్రమనివారణకు వింజామరలు వీయింపజేశాడు.

హిమవంతుడి పక్షపు స్త్రీలు శివుణ్ణి చూసి, "మన పార్వతి అదృష్టవంతురాలు! కోటి మన్మథులకు సమానమైన



భర్త ఆమెకు లభించాడు," అనుకున్నారు. మేనక శివుడి ముందు చేతులు జోడించి, "సదాశివా, కిట్టనివాళ్ళు చెప్పిన మాటలు విని నిన్ను నిందించాను. నా తప్పు మన్నించి, మా ఇంటికి వచ్చి, మేము చేసే వరపూజలు గ్రహించి, మా పార్వతిని వివాహం చేసుకో," అన్నది. పెద్ద ముత్తయిదువులు వచ్చి శివుణ్ణి దీవించారు.

దారిపొడుగునా పుష్పాలూ, ముత్యాలూ, అక్షింతలూ చల్లుతూ, మేనకా హిమవంతులు శివుణ్ణి విడిదికి తీసుకుపోయి, వరపూజ చేసి, పెళ్ళికొడుకు పరివారానికి ఏ లోటూ లేకుండా ఏర్పాటు చేసి, తమ ఇంటికి తిరిగి వచ్చారు.

కులాచారం ప్రకారం పార్వతి అంబిక ఆలయానికి వెళ్ళి, ఆ దేవిని పూజించింది. ముత్తయిదువులు వెంట రాగా పల్లకీ ఎక్కి పార్వతి ఆలయానికి వెళ్ళేటప్పుడు దేవతలు ఆమెను చూసి, "ఈమె పరదేవతే! ఈమెకూ, శివుడికీ పెళ్ళి జరిగితే మన కష్టాలు తీరుతాయి," అనుకున్నారు.

పార్వతి అంబిక పూజ చేసి తిరిగి వచ్చేసరికి ముహూర్తం దగ్గిరపడింది. శివుణ్ణి ఐరావతం మీద కల్యాణ మంటపానికి తీసుకువచ్చి, పీటల మీద కూర్చోబెట్టారు. మేనకా హిమవంతులు అల్లుడి కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకున్నారు. వాళ్ళు పార్వతి చేతిని శివుడి చేతిలో పెట్టి కన్యాదానం చేశారు.

శివపార్వతుల పెళ్ళి అత్యంత వైభవంగా జరిగిపోయింది. దేవతలు శివుడి అనుమతి పొంది తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. శివుడు హిమవంతుడి ఇంట చాలా కాలం ఉన్నాడు. ఆయనకు కైలాసానికి వెళ్ళిపోవాలనిపించి, నందీశ్వరుడి చేత మేనకా హిమవంతులకు ఆ మాట చెప్పించాడు.

మేనకా హిమవంతులు పార్వతిని శివుడి వెంట పంపటానికి సన్నాహాలన్నీ చేశారు. ఆమెకు బట్టలూ, పరిచారికలూ,

గృహోపకరణాలూ, ఆమె ఎక్కి తిరిగిన సింహమూ మొదలైనవి అరణంగా ఇచ్చి, శివుడికి అప్పగించి, "పార్వతిని ప్రేమగా చూసుకో," అని చెప్పారు. పెద్ద ముత్తయిదువులు పార్వతికి చెప్పవలసిన నీతులన్నీ చెప్పారు.

ప్రయాణానికి మంచి ముహూర్తం చూసుకుని, పార్వతితో సహా కైలాసానికి తిరిగి వచ్చి, మహర్షుల సహాయంతో శివుడు గృహప్రవేశం చేశాడు. మూడు రోజులపాటు శివుడి ఇంట విందులు జరిగాయి. తరవాత బ్రహ్మ, విష్ణువూ, మిగిలినవారూ శివుడితో వెళ్ళి వస్తామని చెప్పారు. శివుడు వారికీ, తన ఆహ్వానం అందుకుని వచ్చిన వారందరికీ తగిన కానుకలు ఇచ్చి గౌరవించి పంపేశాడు.

పార్వతీ కల్యాణానికి వచ్చిన అతిథులంతా వెళ్ళిపోయారు. శివుడు నందీశ్వరుడితో, "నేనూ, పార్వతీ విశ్రమించి బడలిక తీర్చుకుంటాము. మహాసౌధాన్ని అలంకరింపజెయ్యి," అన్నాడు.

నందీశ్వరుడు గణాధిపతులను వెంట బెట్టుకుని మహాసౌధానికి వెళ్ళాడు. ఆ సౌధాన్ని శుభ్రం చేసి, పన్నీటితో కడిగారు. జవ్వాది మొదలైన పరిమళ వస్తువుల తోనూ, ముత్యపు పొడితోనూ పద్మాల ముగ్గులు పెట్టారు. పగడాలతో తయారు చేసిన మంచం మీద హంస తూలికా తల్పాన్ని అమర్చారు. గోడలకు చిత్ర పటాలు తగిలించారు. పానీయాలూ, తినుబండారాలూ, పువ్వులూ, ఫలాలూ ఉంచవలసిన చోట ఉంచారు. పడకగది ఎంతో అందంగా తయారయింది.

శయ్యాగృహం అందంగా సిద్ధమయిందని వినగానే శివుడు నందీశ్వరుడు మొదలైనవారితో, "మేము వెళ్ళి పడుకుంటాము. మీరు ఎవరినీ లోపలికి రానివ్వక, భవనం అన్ని పక్కలా కాపలా కాయండి," అని చెప్పి, పార్వతిని చెయ్యి పట్టుకుని శయనించటానికి తీసుకుపోయాడు. వారు దాంపత్య సుఖాలలో మునిగి పోయారు.



# ప్రజాప్రతినిధి!

నాగవరం అనే గ్రామంలో వామనమూర్తి అనే అతను, ప్రతి చిన్న తగాదాకూ, "ఇది యిక్కడ తేలదు. నేనున్నాను. న్యాయస్థానంలో వ్యాజ్యం వేయండి!" అంటూ జనాన్ని ఉసికొలిపి, న్యాయస్థానాలచుట్టూ తిప్పేవాడు.

ఒకసారి గ్రామస్థులకు, రాజధానీ నగరానికి ప్రజాప్రతినిధిగా ఎవరిని ఎన్నుకోవాలన్న సమస్య ఎదురైంది. అందరూ ఏకాభిప్రాయానికి రాలేక, ఆ బాధ్యత గ్రామ పెద్దకు అప్పగించారు.

ఆయన నాలుగైదు రోజులపాటు రాత్రివేళల్లో మారువేషం వేసుకుని గ్రామమంతా తిరిగి, ప్రజాప్రతినిధిగా వామనమూర్తిని పంపమని గ్రామస్థులకు సలహా యిచ్చాడు.

"ఈ వ్యాజ్యాల వామనమూర్తా, రాజధానిలో మన ప్రతినిధి!" అంటూ గ్రామస్థులు ఆశ్చర్యపోయారు.

అప్పుడు గ్రామపెద్ద వాళ్ళతో, "ఈ గ్రామంలో అన్ని తగువులకూ వామనమూర్తే కారణం అన్న అనుమానం నా కుండేది. ఈ మధ్య రాత్రివేళల్లో గ్రామం అంతా పర్యటించాక, అది నిజమని దృఢపడింది. అందువల్ల, వామనమూర్తి రాజధానికి వెళ్ళిపోతే, గ్రామం ప్రశాంతంగా వుంటుంది. ప్రజాప్రతినిధి అయినవాడు రాజధానిలో నివాసం ఏర్పరచుకోవాలిగదా!" అన్నాడు.

దానితో గ్రామస్థులు ఏకగ్రీవంగా వామనమూర్తిని తమ ప్రతినిధిగా ఎన్నుకుని, మూటాముల్లే సర్దిపెట్టి, అతణ్ణి రాజధానికి సాగనంపారు.

—ఎం. డి. సౌజన్య





# సుల్తానూ-డేగా

ఇరాక్ దేశంలోని కెరవాన్ అనే ఒక రాజ్యానికి యువకుడొకడు సుల్తాన్ అయాడు. అతడు తన తెలివితేటల గురించి తనే గొప్పలు చెప్పుకునేవాడు.

''నేను ఏ పని చేసినా బాగా ఆలోచించే చేస్తాను,'' అనితరచూ అంటూ ఉండేవాడు.

అతని చుట్టూ ఉన్న పరివారమంతా అతని మెప్పు పొందడం కోసం, ''అవును, ప్రభూ! మీ తెలివితేటలు అపారమైనవి!'' అని తెగపొగిడేవాళ్ళు.

అయినా, సుల్తాన్ ఆస్థానంలోని వృద్ధ మంత్రి మాత్రం, అవకాశం దొరికినప్పుడల్లా, ''ప్రభూ! ఏ పని కూడా తొందరపడి చేయకూడదు. నిదానంగా ఆలోచించే చేయాలి,'' అని చెప్పేవాడు.

వృద్ధమంత్రి ఎందుకిలా చెబుతున్నాడన్న విషయం, సుల్తానుకు అంతుపట్టేదికాదు.

సుల్తాన్ ఒక డేగను ఎంతో గారాబంగా పెంచేవాడు. అది చాలా తెలివిగల డేగ. ఆ డేగ ఎప్పుడూ సుల్తాన్ వెన్నంటే ఉండేది. ముఖ్యంగా సుల్తాన్ వేటకు వెళ్ళేప్పుడు, అతనితోపాటు వెళ్ళి, ఆకాశంలో ఎగురుతూ, చుట్టుపక్కలు పరిశీలించి చూసి, ఏ వైపున మృగాలు ఉండేదీ, తెలియజేసేది. దాపుల్లో ఏదైనా అపాయంవుంటే సుల్తాన్‌ను హెచ్చరించేది.

ఒకనాడు సుల్తాన్, తన పరివారంతో వేటకు వెళ్ళాడు. అక్కడ వాళ్ళకు ఒక అందమైన జింక కంటబడింది. దానిని అందరూ ఒక్కసారిగా చుట్టుముట్టారు.

''జింకను తప్పకుండా పట్టితీరాలి. ఒకవేళ అది ఎవరివైపు నుంచి అయినా తప్పించుకుంటే, వాళ్ళ ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!'' అని గట్టిగా హెచ్చరించాడు సుల్తాన్ తన పరివారాన్ని.

అరేబియా కథ

జింక ముందు కాళ్ళ మీదికి వంగి, కొంతసేపు అలాగే చూస్తూ నిలబడి, ఉన్నట్టుండి ఛెంగున సుల్తాన్ తల మీదుగా అవతలికి దూకి ఒక్క క్షణంలో అడవిలోకి పారిపోయింది!



సుల్తాన్ పట్టరాని ఆవేశంతో, "ఆ జింకను చంపి తీరుతాను!" అంటూ గుర్రాన్ని అదిలించి ముందుకు ఉరికించాడు. గుర్రం అమితవేగంగా జింకను వెంబడించింది.

అయితే, అది అరణ్యప్రాంతం కావడం వల్ల పొదలగుండా, చెట్లచాటున జింక సులభంగా తప్పించుకుపోసాగింది. కాని, గుర్రం అంత సులభంగా దాన్ని అనుసరించలేకపోయింది. జింకను అనుసరిస్తూ డేగ ఆకాశంలో ఎగరసాగింది.

సుల్తాన్, డేగ సాయంతో జింకను వదలకుండా వెంబడించాడు. చాలా దూరం వెళ్ళిన తరవాత, అడవి చివరికి చేరుకున్నారు: అక్కడ చిన్న చిన్న చెట్లు మాత్రమే వున్నాయి. ఇదే మంచి సమయమనుకుని సుల్తాన్, జింకను గురిచూసి బాణంతో కొట్టాడు. బాణం దెబ్బకు విల విల తన్నుకుంటూ జింక నేల కొరిగింది.

జింకను పడగొట్టానన్న సంతోషంతో అతడు దాపులనున్న ఒక బండ మీద కూర్చున్నాడు. ఆ బండను అనుకుని ఒక చిన్న రాళ్ళగుట్ట ఉన్నది. ఆ గుట్ట మీద డేగ కూర్చున్నది.

సుల్తాన్ బాగా అలిసిపోయాడు. అతనికి దాహం వేస్తున్నది. నీళ్ళకోసం చుట్టుపక్కల కలయచూశాడు. దగ్గరే దొన్నెలా ఉన్న ఒక పెద్ద ఆకు అతని దృష్టిని ఆకర్షించింది. ఆ దొన్నెలో కొద్దిగా నీళ్ళున్నాయి. రాళ్ళగుట్ట మీది ఒక పొద నుంచి నీటిబొట్లు ఒక్కొక్కటిగా ఆ ఆకులో పడుతున్నాయి. ఆ కొద్దిపాటి నీళ్ళతో దాహం తీరకపోయినా, కనీసం గొంతయినా తడుపుకుందామని, సుల్తాన్ ఆ ఆకును జాగ్రత్తగా కొమ్మ నుంచి

తుంచి, మెల్లగా నోటి దగ్గరకు తీసుకొచ్చాడు.

వెంటనే డేగ వేగంగా వచ్చి, అతని చేతిలోని ఆకును కాళ్ళతో తన్ని దూరంగా తోసి, యథాప్రకారం వెళ్ళి గుట్ట మీద కూర్చున్నది!

"ఛీ, నీ దప్పిక తీర్చుకోడానికి ఇదా దారి!" అని డేగను తిట్టుకుంటూ, సుల్తాన్ మరొక ఆకు తీసుకుని పై నుంచి పడుతున్న నీటి బొట్లను జాగ్రత్తగా పట్టుకున్నాడు. కాని, డేగ మళ్ళీ అదే వేగంతో వచ్చి అతని చేతిలోని ఆకును దూరంగా తోసివేసింది!

సుల్తాన్ పట్టరాని కోపంతో డేగను దగ్గరికి రమ్మని సైగ చేశాడు. అది దగ్గరికి రాగానే, కత్తి దూసి దాని తలను తెగ వేశాడు!

ఆ తర్వాత, సుల్తాన్ నీటిబొట్లు ఎక్కడి నుంచి పడుతున్నాయో తెలుసుకుందామని, గబగబా గుట్ట మీదికి ఎక్కాడు. గుట్ట మీద పడుకుని ఉన్న ఒక పెద్ద పాము నోటి నుంచి స్రవించే విషమే బొట్లు బొట్లుగా పడుతున్నది! దానిని తాగితే చచ్చిపోగలడనే, డేగ సుల్తాన్‌కు అడ్డు పడింది!

అసలు సంగతి తెలుసుకుని సుల్తాన్ ఎంతో విషాదం చెందాడు. దాపులనే ఒక సెలయేరు కనిపించినా, నీళ్ళు తాగకుండానే, వెంటనే కిందకు దిగి వచ్చి, చచ్చి పడి ఉన్న డేగను తీసి, తొడపై ఉంచుకుని ఆప్యాయంగా నిమురుతూ స్పృహ కోల్పోయాడు.

చాలా సేపటికి, అతని నౌకర్లు అక్కడికి వచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని అతనికి దాహం యిచ్చి, స్పృహ నుంచి మేల్కొలిపారు. జరిగిపోయినదానికి విచారించవద్దని సుల్తాన్‌ను ఓదార్చారు. అయినా, అతని విషాదం తీరలేదు.

ఏ పని కూడా తొందరపడి చేయకూడదని వృద్ధమంత్రి మాటిమాటికీ ఎందుకు హెచ్చరించేవాడో, సుల్తాన్‌కు అప్పటికి తెలిసివచ్చింది!



# ఆఫ్రికా ఏనుగులు

క్రీ॥ పూ॥ 218 వ సంవత్సరం ఉత్తర ఆఫ్రికా నుంచి హానిబాల్ అనే సేనానాయకుడు రోమనుల మీదికి దండెత్తాడు. ఆ యుద్ధంలో హానిబాల్ పక్షంలో ఏనుగులు కూడా పోరాడాయి. అయినా అప్పుడు ఆల్ప్స్ నుంచి ఇటలీకి వెళ్ళే భయంకరమైన మార్గ మధ్యంలో ఏనుగులు కొన్ని మరణించాయి. హానిబాల్ యుద్ధానికి నడిపించిన ఏనుగులలో అధికభాగం ఆఫ్రికాకు చెందినవి. మిగిలినవి భారతదేశానికి చెందినవి.

ఒక కాలఘట్టంలో ప్రపంచంలోని పలు ప్రాంతాలలో ఏనుగులు ఉండేవని, ఆధారాలు ఉన్నప్పటికీ ప్రస్తుతం ఆఫ్రికా, భారతదేశాలకు చెందిన రెండు రకాల ఏనుగులు మాత్రమే ఉన్నాయి.

ఈ రెండు రకాలలో ఆఫ్రికాకు చెందిన ఏనుగు ఆకారంలో మరీ పెద్దది. ఈ ఏనుగుల పెద్ద పెద్ద చెవులు వినడానికన్నా, శరీరాన్ని చల్లగా ఉంచుకోడానికే ఎక్కువగా ఉపయోగపడతాయి. వీటి వెడల్పాటి చెవులు శరీరంలోని వేడిని మిగతా అవయవాలకు చేరవేయడానికీ, అవసరమైతే విసనకర్రల్లా గాలిని పుట్టించడానికీ ఉపయోగపడతాయి.

భారతదేశంలోని ఏనుగులు నీడలు సమృద్ధిగా ఉండే దట్టమైన అడవులలో నివసించడం వల్ల, వీటికి అంత పెద్ద చెవులు అవసరం లేదు.

ఆఫ్రికా ఏనుగుల కుంభస్థలాలు మన ఏనుగుల కుంభస్థలాలకన్నా కాస్త పల్లంగా ఉంటాయి. తొండం మీద ముడతలు ఎక్కువగానూ, చివర రెండు పెదాలూ ఉంటాయి. దంతాలు మరింత పొడవుగా వుంటాయి.



ఆడ ఏనుగులూ, ఏనుగుగున్నలూ, కలిసి కుటుంబజీవితాన్ని సాగిస్తాయి. ఇలా కొన్ని కుటుంబాలు కలిసి ఒక గుంపుగా ఏర్పడతాయి. అవసరమైనప్పుడు మాత్రం మగ ఏనుగులు వచ్చి గుంపుతో కలుస్తాయికాని అవి ఎప్పుడూ విడిగానే ఉంటాయి.

ఏనుగు ఈనేప్పుడు పక్కనే మరొక ఆడ ఏనుగు సహాయంగా నిలబడుతుంది. ఆఫ్రికా ఏనుగులు యాభై సంవత్సరాలూ, ఇండియా ఏనుగులు డెబ్బై సంవత్సరాలకు పైగా జీవిస్తాయి.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



Varadaraya Nayak



Srivatsa S. Vati

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బొమ్మంటే ప్రాణం    రెండవ ఫోటో: ఇమ్మంటే మారాం

పంపినవారు: చావలి సర్వేశ్వరశర్మ, నర్సింగరావుపేట, అనకాపల్లి-531 001

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం



# మాల్టోవా ముఠా అకస్మాత్తుగా చేసిన గమ్మత్తు

ఆరోజు మిన్నీ పుట్టిన రోజు పండగ. ముఠా మొత్తం వాళ్ళ తోటలో కూర్చుని మాల్టోవా తాగుతూ మిగిలిపోయిన కేక్ తింటున్నారు. అబ్బ, ఎంత మంచి కేకో అది! నిండా చాక్లెట్ ఐసింగూ, కొవ్వొత్తులూను. ప్యాకెట్ ఒకరి నుంచి మరొకరికి అందిస్తుంటే ఎంత మజా వచ్చిందో. ఇక మిన్నీకి వచ్చిన బహుమతులు అన్నీ ఇన్నీ కావు. అయితే మటుకు పుట్టిన రోజు పండగ జరుపుకుంటున్న మిన్నీ మాత్రం మాట్లాడకుండా కూర్చుంది.

**"ఏమిటి మిన్నీ, ఏమిటీ సంగతి?"**

"అనాథాశ్రమంలో దీరూ తెలుసుకదా బాబూ! నిన్న మమ్మీ ఆ అబ్బాయిని రమ్మంది. ముందెప్పుడూ వాడు పుట్టిన రోజు పండగల కెళ్ళలేదు తెలుసా! అనాథాశ్రమంలో పుట్టిన రోజు పండగలెవరూ జరుపుకోరు. వాడి పుట్టిన రోజేమో ఈ శనివారం" మిన్నీ కళ్ళలో నీళ్ళు తిరిగి రెండు పెద్ద బొట్లు చెంపల మీదకి జారాయి. అందరూ నిశ్శబ్దమైపోయారు. అందరికీ దీరూ తెలుసు, ఇష్టం కూడాను. ఆ అబ్బాయి ముఖంలో నవ్వే కనిపించేది కాదు పాపం.

**నరేంకు గొప్ప ఐడియా వచ్చింది.**

నరేం గమ్మత్తుగా ముఖం పెట్టి నవ్వుకుంటున్నాడు. దీరూకు చెప్పా పెట్టకుండా పార్టీ ఏర్పాట్లు చేస్తేనో! అందరూ అది గొప్ప ఐడియా అన్నారు. బాబూ జేబు ఖర్చు డబ్బులో కాస్త మిగిలింది, పనికొస్తుంది. నేబు వాళ్ళమ్మ కేక్ చేసివ్వగలదు. మాలతి కూడా సహాయం చేస్తానంది. మిన్నీ తనకొచ్చిన బహుమతుల్లో కొన్ని ఇస్తానంది. ముఠా మొత్తం సంబరపడి పోయారు. అందరూ రహస్యాన్ని గుండెల్లో దాచుకున్నారు.

**దీరూకి తెలియని రహస్యం.**

ఆ శనివారం నాడు దీరూని నరేం ఇంటికి పిలిచాడు. ఎవ్వరూ ఎదురొచ్చి పలకరించలేదు పాపం. బెరుగ్గా వచ్చి తలుపు కొట్టాడు. అదే తెరుచుకుంది. "ఎవరన్నా ఉన్నారా, లేదా" బెదురుగా అన్నాడు. ఇల్లంతా చీకటి మయం. ఉన్నట్టుండి లైట్లు వచ్చేశాయి. అందరూ "హేపీ బర్త్ డే" పాడటం మొదలెట్టారు. అనాథాశ్రమం నుంచి దీరూ నేస్తాలూ, మాల్టోవా ముఠా అందరూ అన్నమాట. టేబిలు మీద తెలుపూ గులాబీ రంగూ కలిసిన పెద్ద కేకొకటి, ఎక్కడ చూసినా బెలూన్లూ. వేడి వేడి మాల్టోవా కప్పులూను. ఎన్నో బహుమతులు కూడా! దీరూకి అదొక బ్రహ్మాండమైన పార్టీ అయిపోయింది. ఆ తడితడి కళ్ళూ, ఆ పెదవుల మీది చిర్నవ్వూ అదే చెప్పక చెప్పాయి!

**అదే మరి మాల్టోవా మహత్యం**

అవును, మాల్టోవా తాగే పిల్లలు జీవితంలో ఆనందాన్ని సంపూర్తిగా జుర్రుకుంటారు. ఎందుకంటే ఒక్కొక్క కప్పు మాల్టోవాలో బంగారమంటి గోధుమలు, బార్లీ, చిక్కనైన పాలు, సమృద్ధియైన కోకో, చక్కెరల మంచితనం నిండుగా ఉంది. వీటితో మంచి నిరోధక శక్తి, బలము, దమ్ము వస్తాయి. మీ పిల్లలకు మాల్టోవా ఇవ్వండి. వాళ్ళు బలంగా, ఆరోగ్యంగా పెరగడం చూసి ఆనందించండి. మాల్టోవా మీ పిల్లలకు జీవితంలో ఉరకల ఉత్సాహాన్నిస్తుంది.

**మాల్టోవా క్లబ్‌లో చేరండి:**

ఎంతో సులభం.
మూడు 500 గ్రా. జాడీల లేబిళ్ళు, లోపలి సీళ్ళు లేదా మూడు 500 గ్రా. రీఫిల్ ప్యాకుల పైని ఫ్లాపులు ఈ చిరునామాకు పంపారంటే చాలు:

**ది మాల్టోవా క్లబ్**
4వ ఫ్లోరు, భండారీ హౌస్, 91 నెహ్రూ ప్లేస్,
న్యూ ఢిల్లీ 110 019.

మీరిక చేరిపోయినట్టే!




JIL జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

**విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం**

SIMOES/JIL/002/84 TEL

# రాతలో విజేత నటరాజ్ పెన్సిల్

నటరాజ్‌తో రాయడంలో మజాయే వేరు. ఇదే, నటరాజ్ పెన్సిలును ఎన్నుకునే వారందరి మనసుల్లోని మాట. అవును మరి. నటరాజ్ ఎంతో చక్కగా రాస్తుంది. నున్నగా, నల్లగా, సన్నగా, ముక్క విరగకుండా. అందుకే నటరాజ్, ఆ రకానికి చెందిన మరే ఇతర పెన్సిలుకన్నా ఎక్కువ కాలం మన్నుతుంది, ఝామ్మని రాస్తూ పోతుంది.

రకరకాల
రంగురంగుల
డిజైన్లలో
లభిస్తుంది



బాండెడ్ లెడ్



**నటరాజ్** పెన్సిల్

అలుపు లేకుండా రాస్తుంది, అధిక కాలం వస్తుంది.

ఉత్కృష్ట ఉత్పాదనల నిర్మాతలు
హిందుస్తాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 001.

everest/85/HP/190-tl